# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Eleventh Day of the Sixth Session of the*
*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Friday, the 8th November*, 1957

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## ADJOURNMENT MOTION RE · FLOODS IN NELLORE AND COASTAL ANDHRA

*Mr Speaker* Under Rule 74, the following notice has been given by hon Sri V Kodandarami Reddy

"I beg to give notice under Rule 74 that I propose to move that the business of the Assembly be adjourned to discuss the serious situation caused by floods in Nellore and coastal Andhra."

దీనిని ముఖ్యమంత్రిగారికి తెలిపియున్నాను. వారు ఆ పరిస్థితినిగురించి చెప్పెదరు.

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి): అధ్యక్షా! నాకు వచ్చిన information, scrappy గా ఉన్నది. Correct గా ఎక్కువ రాలేదు. పోలీసు డిపార్టుమెంటుద్వారా కొద్దిగా వచ్చినది Breach అయిన స్థలానికి చేరుట యిప్పటికి కష్టముగాఉన్నది. ఏమైనా D. S. P. కష్టపడి గూడూరు, సూళ్ళూరుపేట తిరిగివచ్చారు. నాకు రిపోర్టు వచ్చినంతవరకు, మద్రాసునుంచి అక్కడకు బస్సులుకూడా రావడం లేదు. ప్రయాణీకులు అక్కడనే ఉండిపోయారు.

వారికి కష్టపడి ఆహారం సప్లయి చేస్తున్నారు అక్కడ చాలా చెరువులు తెగి పోయినవి ఎన్ని తెగిపోయినవో యింకా తెలియదు They are not able to reach that place తెగిపోయినవనిమాత్రం D S P గారి రిపోర్టులో ఉన్నది అక్కడకు vehicle పోవుటకుకూడ వీలులేకుండా ఉన్నది రోడ్లు repair చేస్తు న్నారు కష్టపడి ప్రజలు ఉన్నచోట్లకు చేరి ఆహార పదార్థాలు అందజేయగలుగు తున్నారు కొందరు చచ్చిపోయిఉంటారేమోనని ఊహిస్తున్నాము కరెక్టు ఫిగర్సు యింకా లేవు మనుష్యులకు ఆస్థికి కొంతనష్టము కలిగినమాటనిజం ప్రయాణీకు లకు యిబ్బంది కలిగినది అంతకన్న information లేనందున ఎక్కువ details యివ్వలేను

శ్రీ వి కోదండరామిరెడ్డి (సర్వేపల్లి) అధ్యక్షా,

మిస్టర్ స్పీకర్ దీనిమీద debate కు అనుమతించను, further information వచ్చినతరువాత మనఎదుట పెడతారు No further debate under Rule 74

రెవిన్యూ మంత్రి ( శ్రీ కె వెంకటరావు ) ఇంకా supplementary information ఉన్నది మేము ఆ వార్త పత్రికలలో చదవగానే కలెక్టరుగారికి information పంపాము ఆయన గండ్లు పడిన స్థలానికి వెళ్ళుటచే టెలిఫోన్‌లో మాట్లాడలేక పోయాము Wireless message పంపాము. తక్షణమే గవర్న మెంటువారి ఖర్చుమీద అక్కడ వారికి కావలసిన relief ముందు యిచ్చి వేయాలని, తరువాత పర్మనెంట్ ప్రపోజల్సు పంపమని చెప్పాము వారినుంచి సెకండ్ రిపోర్టు అందగానే దానికి సంబంధించిన బోర్డు మెంబరును పంపడమో, నేను వెళ్లడమో చేసి, తగినటువంటి సహాయం చేస్తాము ఎవరూ ఆదుర్దా పడవలసిన అవసరంలేదు. ముందుగా వాళ్ళకు భోజనము, ప్రాణ రక్షణకు instructions వెళ్ళిపోయినాయి

శ్రీ వి. కోదండరామిరెడ్డి అధ్యక్షా ! చిన్న clarification అడుగుతు న్నాను ముఖ్య మంత్రిగారు సమాధానం యిచ్చిన తరువాత చాలా తృప్తిగా ఉన్నది తరువాత వెంకటరావుగారు మాట్లాడుటకు అవకాశం యిచ్చినారు. అదేమాదిరి, నేను clarification అడిగితే, నాకు అవకాశం యివ్వలేదు

మిస్టర్ స్పీకర్ There is no further debate under Rule 74. వెంకటరావుగారికి అవకాశం యిచ్చానంటే, ఆయన మంత్రి వర్గంలో ఒక భాగం. ఆయన information చెప్పవచ్చును. తప్పులేదు.

శ్రీ ఎ సి సుబ్బారెడ్డి (నెల్లూరు) Point of Order, Sir మంత్రిగారు వెంటనే అక్కడకు పోయి పరిశీలనచేస్తే బాగుంటుంది ఇంతకుముందు కృష్ణా, గోదావరి జిల్లాలలో జరిగితే వెంటనే పరుగెత్తినారు మా నెల్లూరుజిల్లా అంటె, దాని ముఖం చూడటంలేదు వెంటనే వెళ్లెదరా, లేదా, అని అడుగుతున్నాను

శ్రీ యన్ సంజీవరెడ్డి ఈ సాయంత్రం సుబ్బారెడ్డిగారిని మా తరపున పంపుతున్నాము వారు తక్షణమే పోతున్నారు, అన్నీ చూచివస్తారు

## LEAVE OF ABSENCE TO SRI GUJJALA RAMUNAIDU, M L A

*Sri P Narasinga Rao (Huzurabad)* I beg to move

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by this House to Sri Gujjala Ramunaidu, Member, Andhra Pradesh Legislative Assembly for the present meeting of the Assembly as he is ill "

*Mr Speaker* The question is

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by this House to Sri Gujjala Ramunaidu, Member, Andhra Pradesh Legislative Assembly for the present meeting of the Assembly as he is ill "

The motion was adopted.

## THE ANDHRA PRADESH COMMERCIAL CROPS (ASSESSMENT) BILL, 1957

*Sri K Venkata Rao:* Sir, I beg to introduce the Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957 and move that the Bill be referred to a Select Committee."

*Mr Speaker* Motion moved.

*శ్రీ కె. వెంకటరావు : అధ్యక్షా. ఇప్పుడు మన రాష్ట్రంలో అమలులో ఉన్నటువంటి ఈ ఎసెస్ మెంట్ అంతా, ఇదివరకు జరిగినటువంటి రిసెటిల్ మెంట్స్ మీద ఆధారపడి ఉన్నది అయితే ఆ సెటిల్ మెంట్ జరిగినప్పుడు, ఈ పొలాల మీద పండే పంటలు కొన్నింటినే లెక్కలోనికి తీసుకున్నారు. నీటి పారుదల కలిగిన తరి భూములు అన్నింటికి కూడ వరిపంటను ఆధారంగా తీసుకున్నారు. మిగిలిన మేరకు భూములలో చోళం, కంబు, రాగి- వీటి out-turns లెక్కలోకి తీసుకొని సెటిల్ మెంట్ రేట్లు ఫిక్స్ చేశారు. Commercial crops ధవా

దాయం యిచ్చే పంటలను, ఈ సెటిల్ మెంట్ రేట్సు ఫిక్సుచేసేటప్పుడు ఆలోచన లోకి తీసుకొనలేదు అందువల్ల యిప్పుడు ఆలోచన లోనికి తీసుకొనవలసిన అవశ్యకత ఏర్పడింది ఒకవిషయం అందరూ అంగీకరిస్తారు ఇటువంటి పంటలవల్ల ఆదాయం ఎక్కువ వస్తుంది పెట్టుబడి ఎక్కువ పెట్టాలి కాని పెట్టుపడి పోయిన తరువాత వచ్చే ఆదాయం యితర రకాల పంటలమీద వచ్చే ఆదాయం కంటే పర్సెంటేజ్ ఎక్కువ ఈ సందర్భంలో ఒక విషయం దృష్టిలోకి తీసుకురావలసి యున్నది ఈ రకమైన పంటలు ఎక్కువగా వానల మీద ఆధారపడి ఉంటాయి అందువల్ల ప్రభుత్వంవారు ఈ బిల్లును ప్రవేశ పెట్టుటలో ఆ విషయాన్ని బాగా గుర్తింపులోకి తీసుకున్నారు ఈ బిల్లు ఆంధ్ర ప్రదేశ్ కంతకీ వర్తిస్తుందిగాని యింతవరకు స్వాధీనం చేసికొనని ఎస్టేట్సుకు వర్తించదు ఎందుచేతనంటే, అక్కడ పన్నులు పెరిగితే, అది అంతా జమిం దారుకు వెళ్ళుతుంది ప్రభుత్వమునకు రాదు

శ్రీ ఆర్ బి. రామకృష్ణరాజు (వడమలపేట) జమీందారీలకు వర్తించదు అనేది మరొకసారి బాగా అర్థమయేటట్లు చెప్పమనండి

శ్రీ కె. వెంకటరావు · అంటే non-taken over estates కు వర్తించదు ప్రభుత్వంవారి స్వాధీనంలో ఉంటే Rent Reduction Act వర్తించి రైత్వారీ అయిపోయింది ఇంకా 10, 12 ఎస్టేట్సును తీసుకొనలేదు వాటిని ఈ బిల్లులో చేర్చలేదు చేరిస్తే ఆ పన్ను జమిందార్లకు వెళ్ళుతుంది వారికి interim payments లేవు కాబట్టి మన స్వాధీనంలో లేని ఎస్టేట్సుకు యిది వర్తించదు

రెండు commercial crops ఒకే పొలంమీద వేయుట తటస్థిస్తే దేనికి హెచ్చురేటు వేయాలో, అదే లెక్కలోకి తీసుకుంటారు తిండిపంట యింకొకటి వేస్తే తిండిపంట బదులు కమ్మర్షల్ క్రాప్ నే లెక్కలోకి తీసుకుంటారు. తోటలకు సంబంధించి ఒకే ప్రదేశములో 10 సెంట్లకు మించిన తోట ఉంటే దానికి పన్ను విధిస్తారు. లేకపోతే విధించబడదు. అంటే చేలగట్లచుట్టూ అక్కడక్కడ చెట్లు వేసుకుంటే లెక్కలోకి రాదు నర్సరీస్ లో కూడ ఒకచోట కొన్నిచెట్లు ముందు పెంచాలి అటువంటి వాటికి కూడ వేయరు. ఈ లిస్టులో 10 అయిటెమ్సు ఉన్నవి. వేరువేరు రేట్లు చూపించబడ్డాయి. ఇంకొక విషయం ఉన్నది.

మనరాష్ట్రంలో పండినటువంటి కమర్షియల్ క్రాప్స్, మొత్తం ఇండి యాలో పండినటువంటి పంటలో యీ తీరున ఉన్నవి గ్రౌండ్ నట్ నూటికి 25 వంతులు. ఆముదాలు నూటికి 56 వంతులు, పొగాకు నూటికి 48 వంతులు, చెరకుగడలు నూటికి 9 వంతులు, మెరపకాయలు నూటికి 30

వంతులు ఉన్నవి ఈ పంటలమీద యీ బిల్లులో చెప్పినవిధంగా పన్నులు వేయటంవల్ల ప్రభుత్వానికి 50, 60 లక్షల మధ్య ఆదాయం వస్తుందని మొన్ననే నేను మనవిచేశాను ఇవి యీ బిల్లులో ఉన్న సంగతులు దీనిని సెలక్ట్ కమిటీకి పంపించి, అక్కడ విచారణచేసి, మళ్ళీ, అది ఇక్కడకు వచ్చిన తర్వాత యీ సభవారు ఆమోదించవలసి ఉంటుంది కాబట్టి యీ బిల్లును సభవారు ఆలోచించి సెలక్ట్ కమిటీకి పంపించాలని కోరుతున్నాను

*Mr Speaker* Sir P Narasinga Rao will move that the Bill be circulated for eliciting public opinion

*Sri P Narasinga Rao* Sir, I beg to move

"That the Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957 be circulated for the purpose of eliciting public opinion

*Mr Speaker* Motion moved.

* శ్రీ పి నరసింగరావు అధ్యక్షా, ఈరోజు మంత్రిగారు ప్రవేశపెట్టిన యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించాలని నేను సవరణ ప్రతిపాదిస్తున్నాను. ఇంతకుపూర్వం వెట్ ఎసెస్‌మెంట్ బిల్లు, సర్చార్జిబిల్లు ప్రవేశపెట్టటం జరిగింది వాటికితోడుగా యీ కమర్షియల్ క్రాప్స్‌మీదకూడ టాక్స్ వేయాలని యీ బిల్లు ప్రవేశపెట్టటం జరిగింది కమర్షియల్ క్రాప్సుమీద ఎక్కువటాక్సు విధించాలని ప్రభుత్వం తలపెడుతున్నది కాని మనదేశంలో ఉండే రైతులు కమర్షియల్ క్రాప్స్‌కోసం తమకు ఉండే మొత్తం భూమిని సాగుచేయటం జరుగదు రైతులు తమభూమిలో ఎక్కువభాగం ఆహారధాన్యాలు పండించుకొంటారు తమ తిండికి అవసరమైన వస్తువులను పండించుకొంటారు ఆవిధంగా పండించుకోగా మిగిలిఉండే కొద్దిభూమిలో నాలుగుపైసలు సంపాదించుకోవటంకోసం ఏ వేరుసెనగో, చెరకో, మెరపకాయలో వేసుకోవటం జరుగుతుంది రైతులకు ఆ కాస్తడబ్బు వచ్చేటటువంటి క్రాప్స్‌మీద ప్రభుత్వం పన్ను వేసి, రైతులకు ఏమీ మిగలకుండా చేయటం సరైందికాదు. షెడ్యూల్‌లో ఇచ్చినటువంటి, పసుపు, సుగర్ కేన్, మెరపకాయలు, గ్రౌండ్‌నట్స్‌ను కమర్షియల్ క్రాప్స్‌గా ఏవిధంగా ట్రీట్ చేస్తున్నారో నాకు అర్థం కావటం లేదు. గ్రౌండ్‌నట్స్, మెరపకాయలు ఆహారపదార్థాల క్రిందకు వస్తాయి. మనదేశంలో కారం ఎక్కువగా తినటం అలవాటు మనం పండించే పంటలు కేవలం ఇక్కడే వాడుకోవటం జరుగుతుంది. కాబట్టి, యీ బిల్లువల్ల అధికమైన పన్నులభారం ప్రజలమీద పడుతుంది షుగర్ కేన్‌కు సంబంధించి, నిజాంసాగర్ క్రింద సాగుచేయ బడుతున్నటువంటి భూమిలో, 50 రూ. నుంచి 70 రూ.

వరకు భూమిశిస్తు రైతులు చెల్లిస్తున్నారు ఈ 70 రూ కాక, మళ్ళీ ప్రతి ఎకరానికి రూ 5 లు యీ రోజున పన్ను వేయటం సమంజసం కాదు ఈ కమర్షియల్ క్రాప్‌టాక్స్, దానికితోడు సెస్సులుపోను, రైతులకు మిగిలేది ఏమిటో అర్థం కాకుండా ఉన్నది గ్రౌండ్ నట్స్ మెరప పంటలు ఎప్పటికీ గ్యారంటీడ్‌గా ఉండవు మూడు సంవత్సరాలకు ఒక సంవత్సరం బాగా పండటం, తరువాత రెండుమూడు సంవత్సరాలు సరిగా పంట పండకపోవటం జరుగుతుంది, తెలంగాణా ప్రాంతానికి సంబంధించినంతవరకు, యీ సంవత్సరం గ్రౌండ్‌నట్ పంట సమయానికి వర్షం పడకపోవటంవల్ల పూర్తిగా దెబ్బతిన్నది అది పీకే సమయంలో వర్షాలు పడినందువల్ల, చాలా పంట యీ సంవత్సరం భూమిలోనే ఉండిపోవటం జరిగింది కమర్షియల్ క్రాప్స్‌ద్వారా నాలుగు పైసలు తెచ్చుకొందామని రైతులు కృషిచేస్తూంటే, వారికి ఎట్టి ఫలితము రాకపోగా, ఆ పంటలమీద పన్ను వేసి, డబ్బు సంపాదించటానికి ప్రభుత్వం ప్రయత్నించటము సరైందికాదని మనవి చేస్తున్నాను కేవలం రైతులమీద పన్ను వేసి వారినుంచి డబ్బు లాక్కోటానికి బదులు ఆంధ్ర లోనున్న ప్రొహిబిషన్‌ను ఎత్తివేసి డబ్బు సంపాదిస్తే బాగుంటుంది తెలంగాణాలో ప్రొహిబిషన్ లేకపోనటంవల్ల 6 కోట్లరూపాయలు ఆదాయం వస్తోంది ఆంధ్రలో ప్రొహిబిషన్ సక్సెస్‌ఫుల్ కాలేదని ట్రెజరీబెంచెస్ సభ్యులే చెప్పారు. మొన్న గుంటూరులో మంత్రి రంగారెడ్డిగారు చెబుతూ, అక్కడ ప్రొహిబిషన్ సక్రమంగా నడవటంలేదని, ప్రొహిబిషన్‌కు వ్యతిరేకంగా ప్రజలు సలహాలు ఇచ్చారని అన్నారు కొన్ని కోట్లమంది రైతులను పన్నులు వేసి కష్టపెట్టేబదులు, ఒక్క ప్రొహిబిషన్‌ను ఎత్తివేస్తే దాదాపు 10 కోట్ల రూపాయలు ఆదాయం వచ్చే అవకాశం ఉంది ఇప్పుడు ఉన్న లోటుపోగా, నిర్మాణ కార్యక్రమములను కొనసాగించటానికి, రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా కొనసాగించడానికి, యన్ జి ఒ లు ప్రయమరీ టీచర్సు మొదలగువారి డిమాండ్లు పూర్తి చేయటానికి అవకాశం కలుగుతుంది అటువంటి విషయాలు ఆలోచించకుండా, కేవలం రైతులమీద ఇర్రేషనల్ బేసిస్‌మీద పన్ను వేయటం సమంజసంకాదు. నిన్న నేను సర్చార్జి బిల్లుమీద మాట్లాడుతూ "ఇక్కడ ఉండే ఎసెస్‌మెంట్ సరైన పద్ధతులమీద లేదు, సరైన పద్ధతులమీద ఎసెస్‌మెంట్ చేసేంత వరకు ఎలాంటి పన్నులు రైతులమీద విధించవద్దని మనవిచేశాను రేషనల్ బేసిస్‌మీద, బేసిక్ ఎసెస్‌మెంటు జరిగిన తరువాత, ఎలిమెంట్ ఆఫ్ ప్రొగ్రెషన్ తీసుకురావచ్చు. ఆ విధంగా అసమానత్వాన్ని దూరం చేయటానికి పయత్నించవచ్చు. అంతేగాని. ప్రభుత్వానికి డబ్బు కావాలని కమర్షియల్ క్రాప్స్‌మీద పన్ను వేయటం సరైందికాదని మనవి చేస్తున్నాను. ఇంతకుముందే ప్రజలు

పన్నుల భారాన్ని మోయలేక బాధలు పడుతున్నారు ఇప్పుడు యీ బిల్లు ద్వారా మరింత భారం వారిమీద పడకుండా మానాలని కోరుతున్నాను ఈ బిల్లును ప్రవేశపెట్టటానికే నేను వ్యతిరేకిస్తున్నాను మంత్రిగారు దానిని ప్రవేశ పెట్టినారు కాబట్టి, యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించి, దానిని క్షుణ్ణంగా చర్చించిన తర్వాత, ఇక్కడకు తీసుకురావాలని తమద్వారా మంత్రిగారికి తెలియజేస్తూ సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ పి సత్యనారాయణ (సామర్లకోట) అధ్యక్షా, ఈ ప్రతిపాదనను నేను బలపరుస్తున్నాను రెవిన్యూ మంత్రిగారి **Sales tax** తో పాటు ఒక **elastic source of Revenue** కు సంబంధించిన బిల్లును ప్రవేశపెట్టుతున్నారు మొత్తము భారతదేశములో ఉన్నటువంటి జాతీయ ఆదాయములో **commercial crops** ద్వారా ఆంధ్రప్రదేశ్ యొక్క **contribution** చాలా ఎక్కువగానే ఉన్నట్లుగా మనకు కనబడుతున్నది అసలు ఈ **tax** ను గురించిన బిల్లు తీసుకునివచ్చేముందు **Agricultural Income-tax** అనేది **Taxation Enquiry Commission** వారు చెప్పిన ప్రకారము తీసుకునివచ్చి ఉన్నట్లయితే ఏ గందరగోళము లేకుండా చక్కగా యిది అమలుజరిగిఉండేది కాని యీ విధముగ అనేకరకముల గందరగోళములకు సంబంధించినటువంటి, యీలాంటి శాసనములను అన్నీ తీసుకునిరావడము అనేది మన ఆంధ్రదేశములో జరుగు తున్నది ఇది చాలా దురదృష్టకరమైన విషయము ఇప్పుడు ఉన్నటువంటి **taxes** లో **gradation** అనేది మాత్రము లేకపోవడము అనేది చాలా పెద్ద లోపముగ కన్పిస్తున్నది. వేయిశనగ గాని, చెరుకు గాని ఎంత విస్తీర్ణములో వేసినను, అవి 150 ఎకరాలలోనైనాసరే, వారి **charges** ఏ విధముగా ఉన్నవో, అదే రేటులో చెల్లించాలనేది శాసనములో కన్పిస్తున్నది అది ఎంత మాత్రము సమంజసమైనదికాదు. ఈ విషయమునే మేము ప్రతిఘటించాలని అనుకుంటున్నాము ఇప్పుడు మనదేశములో **cost of living Index** విషయము చూస్తే సాధారణముగా దేశములో ఏ నూరు రూపాయలో ఆదాయంవచ్చే కుటుంబాలు అన్నింటిమీద కూడ అదనపుపన్నుల భారము ఉంటే, యిదివరకు **Sales tax** వగైరాలు అన్నీ **continue** అవుతూనేఉన్నవి కాని యీ అదనపు **tax** మాత్రం ఆ వర్గముపైన పడకూడదు అనే ఒక **general principle** గా తీసుకుంటే చాలాబాగాఉంటుంది అది అమలుజరపడము కూడ చాలా సంతోష కరమైన విషయమే ఇప్పుడు ప్రభుత్వానికి యాభై లక్షలరూపాయలు వస్తాయందని వారు అంటున్నారేకాని, మా లెక్కల ప్రకారము చూస్తే ఒక కోటి రూపా యలదాకా వీటివల్ల ఆదాయము వచ్చేటట్లుగా కన్పిస్తున్నది ఈ యాభై

లక్షలో, ఒక కోటో ఎంతో వచ్చినప్పటికినీ, ఆ gradation principle అంగీకరిస్తే, బిల్లులోని షెడ్యూలులో మాత్రము కొంత మార్పుచేయవలసిఉంటుంది అది ఒక లక్ష రూపాయలకు తగ్గకుండ రావటానికి ఏర్పాటుచేయవచ్చు అయితే నిన్న మొన్న జరిగినటువంటి సంభాషణలలో కళావెంకట్రావుగారు చెప్పింది ఏమిటంటే, practical విషయములో చెప్పండి, అంతేకాని సిద్ధాంతాలలోనికి మాత్రము మీరు వెళ్ళకండి, అది కాలహరణము తప్ప ఎందుకువచ్చిన సిద్ధాంతాలు యివి, అనే వ్యవహారముగ మాట్లాడారు అసలు సిద్ధాంతాలను పురస్కరించుకునికదా దేశములో ఈ పార్టీలు అన్నీ ఏర్పడినవి అవతల Treasury Benches లో వారు కాంగ్రెస్ పార్టీవారుగా కూర్చోవడము, యివతల మరొక పార్టీవారముగ మేము Opposition Benches లో కూర్చోవడము అందువల్లనే సిద్ధాంతాలను పురస్కరించుకోకుండా మనము వ్యవహారాలలోనికి వెళ్ళడము కష్టతరమైన విషయము షెడ్యూలులో ఒక రూపాయి ఇటో అటో తేడా వస్తేరావచ్చు Exemption limit వ్యవహారములో మాత్రము సిద్ధాంతాలలోనికి పోకతప్పదు ఈ రోజున ప్రభుత్వమువారు prohibition అమలులో పెట్టినప్పుడు సిద్ధాంతముకొరకు పెట్టినామని అంటున్నారేగాని, ఆచరణలో చూస్తే చక్కగా అమలు జరుగుతుందని కాదు నైజాముకు సాలుకు యాభై లక్షల రూపాయలు యిస్తున్నారంటే, సిద్ధాంతముకొరకే గాని, మరొక దానికొరకేమి కాదు. అందువల్ల exemption limit అంటూ ఒకటి పెట్టడమనే సిద్ధాంతము గురించి మంత్రిగారు కొంత జాగ్రత్తగాను, serious గాను ఆలోచించాలని కోరుతున్నాను

ఇంకొక విషయము నిన్న మొన్న జరిగిన చర్చలలో ప్రతిపక్షమునుంచి మాట్లాడినను, ప్రభుత్వ పక్షమునుంచి మాట్లాడినను యీ కొత్త tax వేయడములో ప్రభుత్వములో ఉండే corruption, wastage, వీటినిగురించి మాత్రము ప్రభుత్వము ఏమీ శ్రద్ధతీసుకోవడము లేదు ఈ taxes ను వేయడములో ప్రభుత్వము తీసుకునే శ్రద్ధ corruption ను గురించి, wastages ను గురించి తీసుకునేటట్లయితే యింకా చాలా డబ్బు మిగిలిఉండేదేనని ధోరణిలో తీసుకుంటే చాలా బాగా ఉంటుందని గట్టిగా ఇరుపక్షములవారు మాట్లాడారు అందువల్ల మంత్రిగారు యిక ముందుఅయినా శ్రద్ధగా యీ corruption ను గురించి, wastage ని గురించి preventive measures తీసుకోవలసిందిగా కోరుతున్నాను

ఇంకొక విషయము ఇప్పుడు schedule లో ఉదహరించిన పది items లో Casuarina విషయము తీసుకునేటప్పుడు దీనికి సంబంధించినది ప్రధానముగ

రోడ్ల సమస్య, రోడ్లు లేకపోవడమువల్ల యీ చెట్లకు సరైన క్రయము రాక పోవడము జరుగుతున్నది రోడ్డు సౌకర్యాలు లేకపోవడముచేత ఎక్కడి సరుకు అక్కడనే నిలబడడమువల్ల ఎక్కువ ఖరీదు రావడము లేదు. అలాంటి చోట అయిదు అణాలు అమ్ముతూంటే, రోడ్డు సౌకర్యాలు ఉన్నచోట ఒక్కొక్క చెట్టు మూడు రూపాయలకు కూడ అమ్ముడుపోతున్నవి తూకము చేసే టట్లయితే యీ రెండు చోట్లలోను 5 అణాలకు అమ్మినచెట్లు, 3 రూపాయలకు అమ్మిన చెట్టుయొక్క తూకము ఒకటిగానే ఉన్నది దీనినిబట్టి రోడ్డు సౌకర్యాలు లేనిచోట్ల owners ఎంత నష్టపడుతున్నారో చూడండి Transport facilities లేనందున casuarina కు ధరలో యింత తేడా కన్పిస్తున్నది ఇప్పుడు ప్రభుత్వము ఎట్లాగో పన్ను వేయటానికి పూనుకున్నదిగనుక, కేవలము యీ casuarina ద్వారా వచ్చే tax మొత్తమును అంతయు కూడ దాని amenities క్రిందనే వినియోగించాలనే సూత్రము కాకపోయి నప్పటికినీ ప్రభుత్వం యిది తనయొక్క moral dutyగా భావించి, ఏ ఏ వస్తువుల మీదనైతే ప్రభుత్వము పన్ను విధిస్తున్నదో ఆయా వస్తువులకు production facilities, transport facilities ను కలుగజేయటానికి, యిదివరకు ఖర్చుచేస్తున్న సొమ్ముకంటె తగినంత హెచ్చుగా ఖర్చుచేయవలసిందని కోరు తున్నాను ఈ విషయము మంత్రిగారు శ్రద్ధతో పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. మూడు ఎకరాలలోపల casuarina తోటలు ఉన్నవారందరికికూడ యీ అదనపు పన్ను మినహాయించాలని కోరుతున్నాను మూడు ఎకరాలనుంచి పది ఎకరాలు ఉండేవారికి పది నయాపైసలు వేస్తే సరిపోతుంది పదినుంచి ఇరవై ఎకరాల వరకు ఒక రూపాయి వేస్తే సరిపోతుంది ఇరవై ఎకరాలకు పైగా ఉన్నవారికి రెండు రూపాయలు వేస్తే సరిపోతుంది ఈ పద్ధతిమీద లెక్కకట్టి పన్నువిధిస్తే, యీ casuarina plantation మీద ఎంత అయితే వస్తుందని మంత్రిగారు అంచనా వేసుకున్నారో, అంతకంటె దానిమీద ఎక్కువగానే వస్తుంది. ఆయన ఒక రూపాయి అని అనుకుంటే, దానికి రు. 1-4-0 వస్తుంది కాని అంతకు తక్కువేమీ రాదు. కనుక ఆ విధముగా అంగీకరించవలసిందని కోరుతున్నాను

తరువాత ప్రత్తివిషయము ఉన్నది ఈ ప్రత్తి మనదేశములో ఎక్కువగ జూదమునకు లోబడిన వస్తువు అయినది. దీనికి సంబంధించిన వారందరు తరచుగ యీ జూదమునకు లోబడి నష్టపడుతున్నారు. 1956 వ సం॥ అక్టోబరులో పుట్టి నాలుగువందల రూపాయల ధరవుంటే యీ రోజున 350 రూపాయలు ఆదోనిలో ఉన్నట్టుగా తెలుస్తున్నది అందువల్ల ధరలస్థిరీకరణ విషయములో కొంత శ్రద్ధవహిస్తేనేగాని దీనికి రక్షణ అనేది ఉండదు. ధరల స్థిరీకరణకు పూను

కుంటూ అయిదు ఎకరాలలోపల ప త్తి పండించేవారికి ఏ విధమైన పన్నుకూడ లేకుండా చేయమని నా అభిప్రాయము 5 ఎకరాలకు పైన 20 ఎకరాల వరకు ఎకరానికి ఎనిమిది అణాలు, 20 ఎకరాలకుపైన ఒక రూపాయి వేయ వచ్చునని నా అభిప్రాయము

తరువాత కొబ్బరితోటల వ్యవహారము ఇది మొత్తము రాష్ట్రములో ఎన్ని ఎకరాలలో ఉత్పత్తి అగుచున్నదో దానికి statistical Bureau వారు తమ bulleton లో ప్రకటించారు గాని అందులోని వివరాలు మాకు తెలియ లేదు కనుక్కుంటే సుమారు ఒకలక్ష ఎకరాలకు పైగా కొబ్బరిచెట్లు నాటి నట్లుగా తెలుస్తున్నది ఆ లెక్కలనుబట్టి బహుశ మంత్రిగారు మూడులక్షల దాకా వస్తుందని అనుకుంటున్నారనుకుంటాను ఏమైనప్పటికినీ యీ కొబ్బరి చెట్లు, కాయ, దానినుండివచ్చే bye-products తో వ్యాపారము సాగించడము అనేది మనకు తెలుసు కాని కొబ్బరికాయ, నూనె, కొబ్బరి వగైరాలు ప్రతి యింట్లో కూడ నిత్యకృత్యములకు వాడే వస్తువులు పేదవాడి దగ్గరనుంచి భాగ్యవంతుడుదాకా ఈ యిళ్ళలో నిత్యము ఉపయోగించే వస్తువులు. దీని విషయములో కొన్ని చిక్కులు ఉన్నవి అందులో అవి చాలా ప్రమాదకరమైన చిక్కులు మంత్రిగారు రాష్ట్రములోకల్లా యీ కొబ్బరిచెట్లు అధికముగ పెరిగే చోటు అయిన అమలాపురం నుంచే వచ్చినవారు వారికి యీ కొబ్బరిచెట్లను గురించి మంచి అనుభవము ఉన్నవారని అందరికీ తెలుసు మన అందరికంటె గూడ ఆయనకు ఆ చిక్కులు బాగా తెలిసి ఉంటవి ఈ చిక్కులు ప్రధానముగ మూడు రకాలుగ ఉన్నవి పది సం॥ల కొకసారి కనీసము ఒకసారి అయినా మనదేశానికి తుపానురాక తప్పడములేదు ఈ తుపానువల్ల వందలకొలది, వేల కొలది చెట్లుపడిపోవడము, కాయలు రాలిపోవడము సంభవించడము మనకు తెలుసు ఈ నష్టము కనీసము నూటికి యాభై వంతులు పైగా వస్తూ ఉంటుంది చెట్లుపడిపోతే, మరల అవి పెరిగి ఫలసాయమునకు వచ్చేటప్పటికి దాదాపు పది సం॥లు అయినను పడుతుంది ఈ లోపల యజమానికి ఆదాయము ఉండదు శిస్తు ప్రభుత్వానికి చెల్లించవలసి ఉంటుంది ఇది ఒకరకమైన చిక్కు అంతే కాకుండా pests వల్ల చెట్లకు, కాయలకు దెబ్బ ఈ pests ను రానీయకుండా prevent చేయడానికి యిప్పటికి 15, 20 సం॥లు గా కృషి జరుగుతున్నది ఇది రెండవ చిక్కు.

ఇక పోతే మూడవది, transport facilities లేకపోవడము. Transport facilities లేనందువల్ల పండిన కొబ్బరికాయలు మంచి ధరకు అమ్ముకోటానికి, అనువైనచోటుకు తీసుకుని వెళ్ళటానికి రోడ్డు సౌకర్యాలు, Transport faci-

lities చాలా అవసరము ఇవి చాలా చోట్లలో లేవు ఈ చిక్కులను తీర్చటానికి ప్రభుత్వము యింతవరకు ఎలాంటి ప్రయత్నము చేయలేదు కాబట్టి యిక ముందు అయినా ప్రభుత్వము కొంత శ్రద్ధవహించితే కొబ్బరి తోటలు వేసేవారు సంతోషిస్తారు

సరే pests విషయములో preventive measures కనిపెట్టడం scientists చేతులలోని వ్యవహారము ఇది Central Government level లో తీసుకో వచ్చును ఇక తుపాను రాకుండా చేయటానికి ప్రకృతి చెయవలసిందె ఇలాంటి తుపానులు సంభవించినప్పుడు ప్రభుత్వముకొంత liberal గా remission యిస్తే మంచిది అంతకంటే చెప్పదగినది ఏమీలేదు

ఇక transport facilities విషయము తీసుకుంటే, యిది కేవలము మన ప్రభుత్వము చేతులలోనిదే Transport facilities లేకపోవడమువల్ల సరియైన marketing చేసుకుని మంచిధర సంపాదించుకోటానికి వీలులేకుండపోవడము జరుగుతున్నది 150 రూపాయలు వచ్చేది, నూరు రూపాయలు అయినను వచ్చే వీలులేకుండా ప్రతి సం ము ప్రభుత్వము యొక్క negligence వల్ల కొబ్బరితోటలు వేసుకున్నవారు నష్టపడుతున్నారని మంత్రిగారు యీ విషయమును గుర్తించాలని మనవిచేస్తున్నాను

ఈ కొబ్బరికాయ పంట సాధారణముగా ఏప్రియల్. మే మాసములలోనే వస్తుంది ఈ నెలలు వేసవి కాలములో ఉండడమువల్ల కాలవలలో నీరు ఉండదు అందువల్ల boat transport కు అయినను scope లేదు ఇదిగాక waggons supply లేకపోవడముకూడ మనము చూస్తూనే ఉన్నాము ఇకపోతె మిగిలినది లారీల transport లారీ ఖర్చులు ఉంటూ ఉంటాయి 150 రూపాయలో ధర ఉండేది 120, 130 లకు దిగిపోతుంది ఈ విధంగా నష్టపడడము తప్పేటట్లులేదు. కాబట్టి ప్రభుత్వము కనీసము యీ ఏప్రిల్, మే నెలలలోనైనా waggon supply జరిగేటట్లు కొంత గట్టిగా ప్రయత్నిస్తే, యీ విధముగా వచ్చేనష్టము కొంత తగ్గటానికి అవకాశము ఉంటుంది కేవలము యిదే నెలలలో ధరలు ఒకవైపున తగ్గడమువల్ల నష్టము, యింకొకవైపున ఫసలీకి ప్రభుత్వానికి శిస్తు కట్టవలసిన తరుణము మెడమీద వచ్చి కూర్చొనడము పైగా అది marriage season కూడా కావడము, ఇలాంటి సమయములో తోటలు వేసుకున్నవారు ఎంత బాధ, యిబ్బంది పడుతూ ఉంటారో గుర్తించాలి ఈ సమయములో తక్కువధరకు కూడ అమ్ముకునే చిన్నచిన్న రైతులు ఉంటూఉంటారు. కాబట్టి ఈ యిబ్బందులన్నీ మంత్రిగారు దృష్టిలో పెట్టుకొని కొంత శ్రద్ధ తీసుకుని waggon supply కి ఏర్పాటు చేయటానికి కృషిచేస్తారని ఆశిస్తున్నాను.

ఇకపోతే పొగాకు పంట విషయము చూస్తే, దీనికి ఒక ఎకరమువరకు పన్నులేకుండా చేయమని నా కోరిక. ఒకటినుంచి అయిదు ఎకరాలవరకు ఒక రూపాయి పెట్టి, 5 నుంచి 10 ఎకరాలవరకు రెండు రూపాయలు, పదిపైన మూడు రూపాయలు యీ విధముగా tax విధించినట్లయితే సబబుగా ఉంటుంది, మన రాష్ట్రములో సుమారు నాలుగు లక్షల ఎకరాలకుపైగా పొగాకు పండిస్తున్నారు ఈ Verginia పొగాకు ఎన్నో varities లో తయారవుతున్నది ఒక్కొక్క రకమునకు ఒక్కొక్క విధముగ పన్ను విధించడము న్యాయము నావద్ద ఆ వివరాలకు సంబంధించిన లెక్కలు లేకపోయినప్పటికినీ, మొత్తము మీద యీ పొగాకు పంట క్రింద ప్రభుత్వానికి ఎంత రాగలదని అంచనా వేసుకున్నారో అంతకు ఒక్క రూపాయి కూడ తగ్గకుండా వస్తుంది నేను చేసే సూచనలు మంత్రిగారు అంగీకరిస్తే, బిల్లుకు చేర్చిన షెడ్యూలులో కొద్దిగా మార్పులు చేస్తే సరిపోతుంది ఆ విధముగాచేస్తే సాంఘికంగా న్యాయము సాధించవచ్చునని మనవి చేస్తున్నాను

ఇకపోతే పసుపు విషయము ఉన్నది పసుపు విషయములో కూడ ఒక ఎకరమువారిని పూర్తిగా మినహాయించాలి ఒకటి నుంచి అయిదు ఎకరాల వరకు రెండు రూపాయలు, అయిదునుంచి పది ఎకరాలవరకు ౩ రూపాయలు, పది నుంచి పైనఉంటే ౪ రూపాయలు, యీ ప్రకారము పన్ను వేయాలని నా అభిప్రాయము. ఈ పసుపు వ్యవహారము కూడ జూదములో కొద్దో గొప్పో చేరినదే అయితే పత్తికీ, దీనికి చాలా తేడా ఉన్నది Cotton కు ధర భారత దేశములో ఉండేటటువంటి fluctuation మీద ఆదారపడి ఉంటుంది పసుపు విదేశీ వ్యాపారాన్నిబట్టి గిరాకీనిబట్టి ధర పెరుగుతూ తగ్గుతూవుంటుంది నావద్ద ఉన్న లెక్కలనుబట్టి 1939 వ సం॥ లో పసుపు ధర పుట్టి 1 కి నూరు రూపాయలు వుంటే, 1954 లో రు 464 లకు పెరిగింది 1955 లో రు 662 కు పెరిగింది 1956 లో రు 455 లకు దిగింది 1957 సం॥ లో జనవరిలో రు 241 లకు తగ్గింది ఈ జూన్ నెలలో రు 178 లకు తగ్గింది. కాబట్టి యీ పసుపు విషయములో మార్కెటు యింత బ్రహ్మాండమైన fluctuation లో ఉన్నది మన దేశములోని planned economy లో organised modern States ఉండగా మన దేశములో యిలా జరగడము అంటే మనకు ఏ మాత్రము గౌరవప్రదము కాదు ముఖ్యంగా యీపసుపుపంట బ్రహ్మాండమైనది కాదు. ఏ దేశములకు ఈ పంటఎగుమతిఅవుతుందో మనకుతెలుసును. అవిమూడు దేశములకంటె ఎక్కువ లేవు. వాటితో చేసుకునే వర్తక ఒడంబడికల విషయంలో direct గా State level లో మనం చేసుకుని ఎంతవరకు ఎగుమతి చేయగలమో contracts

ద్వారా ఆ మేరకు ఒక fixed rate లో market తో ప్రభుత్వం ప్రవేశించి State trading చేసినట్లయితే దాని influence మిగతా production మీదకూడా వుండి, ధరల స్థిరీకరణకువారు కొంత దోహదం చేయడం జరుగుతుంది ఒకవేళ రాష్ట్ర ప్రభుత్వం తనంతట తాను చేయలేకపోతే కేంద్ర ప్రభుత్వం తీసుకుని వర్తకం చేయడానికి సిఫార్సు చేసి ధరల స్థిరీకరణ కోసము యీ ఏర్పాటు చేయాలని కోరితే చక్కగా వుంటుందని మనవి చేస్తున్నాను

తరువాత చెరకువుంది ఈ చెరకుమీద కొంచెము బండగా అన్నిటికీ కలిసి ఎకరానికి 5 రూపాయలు వేశారు ఇది మంత్రిగారికి తెలియని విషయంకాదు మిల్లుకు చెరుకుతోలే రైతులు ఎక్కువ సంపాదించవచ్చు కాని సొంతంగా బెల్లం ఆడించుకున్నట్లయితే దానికంటె చాలా తక్కువ ఆదాయము వస్తుంది అందుచేత మిల్లులో ఒక ఎకరానికి permit యిచ్చినట్లయితే వేయి రూపాయలు బహుమానం యిచ్చుకొంటున్నందువల్ల permit లు market లో ఒక commodity క్రింద చెలామణీ అవుతున్న విషయము మీకు తెలిసినదే బెల్లం వ్యాపారం కిట్టడం లేదనటానికదే నిదర్శనం. అందువల్ల బెల్లానికి పంచదారకు ఒకటే రేటు పెట్టడం న్యాయంకాదు అందువల్ల మిల్లుఆడే చెరకు విషయంలో ఒక ఎకరంవరకూ పన్నులేకుండా చేసి 1 నుంచి 5 వరకూ రెండు రూపాయలు పెట్టి 5 నుంచి 10 వరకూ 4 రూపాయలు పెట్టి 10 ఎకరాలకుపైన 8 రూపాయలు పెట్టినట్లయితే మీరు అనుకున్న ... ...

మిస్టర్ స్పీకర్ భాష మార్చాలని కోరుతున్నాను. 'మీరు' అనకండి Parliamentary language సభ్యులు నేర్చుకోవాలి

శ్రీ పి. సత్యనారాయణ నేర్చుకుంటున్నాను నేను తరచుగా మాట్లాడక పోవడం వల్ల యింకా అలవాటుకాలేదు పది ఎకరాలకు పైన మంత్రిగారు ఎనిమిది రూపాయలు పెట్టినట్లయితే వారు అనుకున్న ఆదాయం అంతా వస్తుందని మనవిచేస్తున్నాను ఇంకొకటి యేమిటంటే చెరకుమీద వేసే cess ను State Finance లో కలిపివేయడం జరుగుతోంది ఎక్కడ factory వుందో ఆ చుట్టు ప్రక్కల వుండే రోడ్లన్నీ ఆరుమాసాలకే పూర్తిగా పాడయిపోతూంటాయి అది State Finance లో కలువకూడదు. అది కేవలం local tax. Local అనగా State tax అని పెడర్థం తీయరాదు. Local అనగా లోకల్. సంస్థలకే అక్కడున్న జిల్లాబోర్డుకో, పంచాయితీబోర్డుకో యిచ్చి- research కి ఖర్చుపెట్టడం వేరే సంగతి— ఎక్కువ డబ్బు అనగా 90% రోడ్లకే వినియోగించి రోడ్లన్నీ మరమ్మతు చేయవలెననే విధంగా విధానం మార్చితే తప్ప మిల్లు చుట్టూ వుండే గ్రామాలు మాత్రం బాగుపడవని మనవిచేస్తున్నాను. ప్రస్తుతం అన్ని మిల్లులకు

చెరకు తోలేటటువంటి రైతులకు ఒకటే ప్రధానమైన సమస్య కనిపిస్తున్నది రైతులకు వాళ్లు prompt గా డబ్బు చెల్లించడంలేదు ఈ విషయంలో ప్రభుత్వం కాస్త జోక్యం కలుగజేసుకున్నట్లయితే సకాలంలో వారికి డబ్బు చేరివుండును Rural Credit Enquiry Report ప్రభుత్వం చేతులలో వుండనే వుంది నెల ఒక్కంటికీ నూటికి 30 రూపాయలు వడ్డీయిచ్చేటటువంటి రైతాంగం మన దేశంలో 70% వున్నారు ఆ డబ్బు మిల్లువారు రైతులకు యివ్వకపోవడం వల్ల యింత పెద్ద వడ్డీలు యిచ్చి తీసుకోవడం జరుగుతున్నది ప్రభుత్వం కన్నెర్ర చేసినట్లయితే మిల్లువాళ్ళు కాస్త జాగ్రత్తగా వుండడానికి అవకాశం వుంటుంది. ఇందులో కలుగజేసుకొమ్మని మనవిచేస్తున్నాను రెండోది బెల్లానికి సంబంధించిన చెరకు దీని విషయంలో మొదటి ఎకరానికి రద్దుచేసి ఒకటి నుండి 5 ఎకరాల వరకూ ఒక రూపాయి మాత్రమే పెట్టడం సబబు కాబట్టి అంతకంటె ఏమాత్ర మైనా ఎక్కువ పెట్టడం సబబు, 5 నుంచి 10 ఎకరాల వరకు 2 రూ లు మాత్రమే పెట్టడం సబబు 10నుంచి ఆపైన 6 రూపాయలు పెట్టినా న్యాయం గానే వుంటుందని మనవిచేస్తున్నాను తరువాత అరటిపళ్లు ఈ అరటివళ్ల వ్యవ హారంలో ఒక 50 సెంట్లవరకు మినహాయించి అరఎకరం నుంచి ఎకరం వరకూ ఒక రూ వేసి 1 నుంచి 5 వరకూ 2 రూపాయలు వేసి, 5 నుంచి 10 వరకు 5 రూ లు వేసి, పదిపైన 8 రూపాయలు వేసుకోవచ్చు అరటివల్ల వారు ఎంత వస్తుందని అనుకుంటున్నారో అంతకుతక్కువ రాకుండా యిచ్చిన షెడ్యూలును తప్పకుండా సవరించుకోవచ్చు అయితే దీనిలో వచ్చేటటువంటి ప్రమాదం యేమిటంటే ఇది చాలా సున్నితమైన పంట అందుచేత తరచుగా పదేళ్ళలో మూడుసార్లో నాలుగుసార్లో పంట తుఫానులకో, పెద్దపెద్ద వర్షాలకో గురి అయిపోతుంది అందువల్ల పూర్తి remission ఆ time లో మనం యివ్వవలసి వుంటుంది ఈ విషయం సానుభూతితో గ్రహించాలని కోరుతున్నాను

తరువాత మిరపకాయలు మిరపకాయలపై ఒక ఎకరంవరకూ రద్దు చేసి 1 నుంచి 5 వరకూ 1-0-0 పెట్టి 5 నుంచి 10 వరకూ 2 రూపాయలు పెట్టి, పదిపైన వున్నటువంటి ఎకరానికి 4 రూపాయలు పెట్టినప్పటికీ మాకు అభ్యంతరం లేదు తరువాత నిమ్మ వగైరాలలో 50 సెంట్లవరకూ పన్ను రద్దుచేసి ½ ఎకరం మొదలుకుని ఎకరంవరకూ 1-0-0 పెట్టి 1 నుంచి 5 వరకూ 2-0-0 పెట్టి ఆపైన ఎంతవున్నప్పటికీ 5 రూపాయలు చొప్పున పెంచివేయ మని కోరుతున్నాను తరువాత వేరుశనగ. ఆంధ్రప్రదేశ్‌లో 30 లక్షల ఎకరాలున్నట్లు తెలుస్తున్నది. మొత్తం ప్రపంచంలోనే ఆంధ్రదేశంలో పండినంత ఇంకెక్కడా పండదనే విషయాన్ని గమనించుకుంటే కొంత సంతోషదాయకం

గానే వుంది కాని దీనికి సంబంధించి Research Station మాత్రం నేటికి ఎందుచేతనో కోయంబత్తూరులోనే వున్నది అది యిక్కడవుండే రైతులకు ఉపయోగపడడం చాలా తక్కువ అందువల్ల ప్రభుత్వం పూనుకుని దానిని transfer చేయించడానికి ప్రయత్నించాలని కోరుతున్నాను మరుప నూనె తీసినట్లయితే ఒక అణా పన్ను ఇదివరకే వుంది ఇటీవల వేసిన additional cess టన్ను నూనెకు 70 రూపాయలు చొప్పున వేశారు ఇందులో మొదటి 120 టన్నులు మినహాయించారు కనుక gradation అనేది, minimum exemption అనే principle దీనిలో యిమిడివుంది దానినే ప్రభుత్వం పన్ను వేసేటప్పుడుకూడా అనుసరించాలని కోరుతున్నాను అంతకంటే యేమీలేదు అయితే దీనికోసంప్రభుత్వం Oil Seeds Committeeని నియమించి, 20 లక్షల రూపాయలు వరకూ ఖర్చు పెడుతున్నారు వాళ్లు schemes వేశారు వ్యవసాయశాఖ మంత్రిగారు ముస్సోరి వెళ్ళి కొన్ని schemes వేసినట్లు తెలుస్తున్నది కాని దీనికి సంబంధించిన సమగ్రమైన, ప్రధానమైన విషయాలు రెవిన్యూ మంత్రిగారు చెబితే బాగుండును వారు చెప్పలేదు మనకు ఉత్పత్తి అధికంచేసే schemes విషయంలో నూటికి 50 రూపాయలు matching grants కేంద్ర ప్రభుత్వం యిచ్చే development schemes ఉన్నాయి Extenstion schemes మరికొన్ని ఉన్నాయి ఇందులో నూటికి నూరు ఖర్చు కేంద్రమే యిచ్చేటటువంటివి వున్నాయి. ఎక్కువగా డబ్బు ఖర్చుపెట్టే schemes నూటికి 99 వేసుకుని అంతా కేంద్రమే డబ్బు పెట్టేస్కీములు ఒకటి మాత్రమే మంత్రిగారు అంగీకరించడం ఎందుచేత జరిగిందో నాకు బోధపడకంలేదు దీనికి సంబంధించిన విషయం మంత్రిగారు చెబితే బాగుంటుందనుకుంటాను

శ్రీ కె వెంకటరావు ఈ మంత్రిగారికి సంబంధించదు వారు చెప్పలేదు

శ్రీ పి సత్యనారాయణ అందుచేత ఆఖరువిషయం యేమిటంటే— మొదట 5 ఎకరాలు మినహాయించమని, 20 ఎకరాలు దాటినతరువాత యిందులో వుండిన రేటు వేయమని కోరుతున్నాను. షెడ్యూలుకు సంబంధించిన వ్యవహారం అయిపోయింది. Multi-crop వేసినట్లయితే ప్రత్యేకంగా పన్ను విధించే విషయమై ఒక clause పెట్టారు. షెడ్యూలులో ఉండేవి 2, 3 crops వేయవచ్చు షెడ్యూలులో వుండేది ఒకటి, లేనిది ఒకటి, యీ విధంగా కలిపి వేయవచ్చు ఈ సందర్భంలో నేను మనవిచేసేది యేమిటంటే—non-scheduled crop అయిన సజ్జ వగైరా కొంత వేసి, షెడ్యూలు crop అయిన వేరుశనగ కొంతవేసినట్లయితే షెడ్యూలు రేటులో సగము రేటు మాత్రమే వసూలు చేయాలని మేము కోరుతున్నాము. ఒకవేళ రెండూకూడా షెడ్యూలులో

వుండేటటువంటి crop వేసినట్లయితే ఏది తక్కువో అది వసూలుచేయమని మేము కోరుతున్నాము "దేశములో ధరలు తగ్గినట్లయితే దీనికి సంబంధించినట్టి చర్య మేము తీసుకొని పన్నులనుండి సదుపాయము చేయటానికి పూనుకుంటాం" అని ఎక్కడో declaration ఒకటి వుంది ఆ విషయంలో మాత్రం 1950-55 rate, average rate గా తీసుకుని 33% 40% తగ్గినట్లయితే పూర్తిగా remission యివ్వాలనీ లేకపోతే proportionate గా remission యివ్వాలనీ కోరుతున్నాను

**Sri B V Subba Reddy (Koilkuntla)* Sir, today, I rise to raise my voice against yet another new tax which is sought to be imposed on the poor agriculturist, and also to focuss the attention of the Government on a very grave and critical situation that has arisen in most parts of the Kurnool District due to failure of rains and crops- on account of heavy rains last year and due to failure of rains completely this year Sir, I know that my voice will not be heard and acted upon by those in authority, but shill I do so in the hope that my opinion, at least to some extent, will be able to influence public opinion, and, for a second reason, that I would thereby be discharging my duty as a representative

It is unfortunate that at a time when Government should think of starting relief works to alleviate the suffering of the poor agriculturist and the poor lobourer, Government should be thinking of imposing new taxes As you are all aware, the atmosphere in Andhra is surcharged with rumblings and wailings of the people with regard to all these new taxes, and I consider that this is a very inopportune moment for the Goverment to think of imposing new taxes

Sir, our Government are very lucky in that there is no well-organized opposition in this House or outside this House. But I would say that that is the very reason why they should be wary and act according to public opinion, for, otherwise, driven to madness and desperation, a time will come. - perhaps, much sooner than we expect, when people will be forced to the inevitable necessity of choosing any other man, except the Congress-man. Sir, many of the Congres members of the Government party both outside this House in private parleys and inside this House during the debate on these new taxation Bills have been more vociferous and vehement in critisizing these Bills; but I am sorry to observe that these very members who oppose the Bills very vehemently have not got the moral courage to act according to their conscience and free will.

*Mr Speaker* That is party system, and we cannot help it That is the system prevailing in democracy, in all democracies

*Sri B V Subba Reddy* Sir, if most of these members are given freedom to vote according to their will and conscience, most of these Bills which are now on the anvil of this House will certainly be blown out

*Mr Speaker* The hon Member cannot talk of their conscience Let him speak about his conscience and so on

*Sri B V Subba Reddy* What is happening only I am saying What is every day happening and what we have been hearing every day, I am saying

*Mr Speaker* It is a party system. ఎవరైనా ఏదైనా మాట్లాడుతారు వోటింగ్ వచ్చినప్పుడు పార్టీవిప్ ప్రకారం చేస్తారు

*Sri B V Subba Reddy* I only say that if they are given freedom of vote according to their conscience

*Mr Speaker* When I am on my legs the hon Member should resume his seat That is the convention.

Conscience అని చెప్పకుండా ఓటు చేస్తున్నారని చెప్పారు బాగానే వుంది. కాని వాళ్ళందరిని conscience ప్రకారంచేస్తే... That is too strong a language and I therefore do not want the hon Member to use that. తక్కిన విషయాలు చెప్పండి. పార్టీ system లో అయినా అంతే ఏ పార్టీవవా అంతే

The hon Member also belongs to a party. The Communists also belong to a party Therefore, the question of individual conscience does not arise He may merely say that Congress-men also are working like that,— merely point out that way, but do not go into the question of conscience and party principles, democratic principles and all that Therefore, go to the next point

*Sri B V Subba Reddy* I am sorry, Sir, that I have not been correctly understood. I have only just submitted that if those hon. Members are given freedom to vote according to their conscience...

*Mr. Speaker* It cannot be done in the party system. Why does the hon Member harp on that ?

*Sri B V. Subba Reddy* I am not repeating that. I will go to the next point

*Mr Speaker* Please do not repeat

*Sri B V Subba Reddy* I would like to bring to the notice of the members of this House the critical conditions that are prevailing in the district of Kurnool Last year, the out-turn of crops was only Rs 0-2-0 on the average, on account of very unprecedented heavy rains This year, there are absolutely no rains after the crops were sown, with the result that groundnut has been a complete failure and the crop has been removed Groundnut and cholam which have been the major crops are complete failures, with the result that today people are left without food for themselves and fodder for their cattle and the poor labourers without employment

Sir, our invocations and our fervent prayers including those of the hon Chief Minister who visited our area last month and of the A P C C President Sri Satyanarayana Raju who also visited along with him have had no effect, and the offerings of people in the shape of goats and coconuts to goddess Gangamma have not produced any effect on the Gods Sir, there has been a complete failure and it looks as though God, the All-Merciful has been very unmerciful, so far as these people are concerned Today, the position is that they are left without any kind of work and famine is raging throughout the area

Sir, at least the poor labourers who have nothing to call their own can shift to some other places where they can find employment, but the unfortunate position of the poor middle-class ryot is that he is left without fodder for his cattle and his family left without food

[Hon Member Sri S Ranganatha Mudaliar crossed the Chair ]

*Mr. Speaker* The hon. Member should not cross the Chair like that.

*Sri B. V. Subba Reddy* He is not in a position to leave his hearth and home and shift to any other place.

The people of this District are not like the people of East Godavari They are very gullible and a less vociferous kind of people. they are simple and unsophisticated but at the same time, from my experience of those people, I know they are a very explosive sort of people. Once, there is an erruption, it is impossible to control those people, so that, I would request the Government not only to act but to act quickly before much havoc is wrought.

Sir, as all of us know, the local officials are not able to take any initiative. Not only that. We are all very well aware that the

official machinery is very complicated and cumbuersome, and it is very tardy and the wheels do not move unless they are greased properly and pushed from behind, even if they move without grease, they only make a lot of noise and produce too much of heat so that it is high time that Government themselves look into the matter immediately and see that something is done The immediate needs are (1) to postpone collection of all arrears of land revenue, loans and all other arrears, (2) to start fair price shops and advance loans to ryots to produce foodgrains, fodder etc

[Another hon Member crossed the Chair ]

*Mr Speaker* It is a wrong way No member should cross the Chair

*Sri B V Subba Reddy* I also request the Government to start relief works immediataly, provide relief to unemployed agricultural labourers immediately, appoint a special officer of the grade of a Collector to enquire into the conditions there and start relief works as early as possible

I know that the hon Chief Minister and the hon Minister for Revenue have got all sympathy for the people of this affected area, but I would only appeal to them to translate their sympathy into action by starting relief works Thank you, Sir

<u>శ్రీ పి బాపయ్య (తిరువూరు)</u> అధ్యక్షా, రెవిన్యూ మంత్రిగారు ప్రవేశ పెట్టిన ఈ బిల్లును నేను బలపరుస్తున్నాను పన్నుల బిల్లులు వచ్చినప్పుడు పన్నులు యిచ్చుకోవలసిన వారికి కష్టంగా వుండేమాట నిజమే కాని నేటి మన బడ్జెట్ పరిస్థితినిబట్టి ప్రభుత్వం జరగాలంటే, మన ప్రణాళికలు దిగ్విజయంగా సాగాలంటే ఈ బిల్లులద్వారా పన్నులు వేయక తప్పదు. ఈ పన్నులేమీ వేయకుండా వుంటే మన ప్రణాళిక దిగ్విజయం కావడానికి అవకాశంలేదు ఈ ప్రణాళిక ఎవరిది ? మనకూ, మన ప్రజలకూ సంబంధించినదే. ఈ ప్రణాళికవల్ల మన గ్రామాలు అభివృద్ధిలోకి రావాలి. మన గ్రామాలలో ప్రణాళికవల్ల ఎన్నో సౌకర్యాలు కలగాలి మంచి వైద్య, విద్యా సౌకర్యాలు కలగాలి. ఇవన్నీ కావాలంటే పన్నులు హెచ్చుగా వేసుకోవలసిన అవసరం లేదామరి ? దీనిని కొంతమంది ఆక్షేపించడం, విమర్శించడం చూసి నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది పన్నులు ఎక్కువగా రైతులమీద వేస్తున్నారు. వారు ఈ పన్నుల భారాన్నంతా భరించవలసినదేనా? అని చాలా మంది విమర్శించారు. సామాన్యంగా ఏ పన్నులు వేసినప్పటికి, direct గా కొందరికి విధించినా ఆ పన్నుల భారం దేశంలో వుండే ప్రజలందరిమీద పడుతుంది, కాని direct గా యిచ్చిన

వారిమీదనే పడదు నూటికి 80 మంది రైతులు కలిగిన మన ఆంధ్ర ప్రదేశ్‌లో పన్ను వేశామంటే ఆ పన్ను రైతులమీద పడకుండా ఎవరిమీద పడుతుంది? కేవలం మిగిలిన 20 మందేగా ఈ పన్నులు చెల్లించవలసినది ? అందరూ ఇచ్చుకోవాలి "తాళ్లపన్ను ఎవడిస్తాడయ్యా అంటే త్రాగేవాడే" అన్నట్లుగా ఏదైనా పన్ను వేస్తే కొంచెం కాకపోతే కొంచెం అయినా consumers మీద పడుతుంది, కాని పడకుండా ఉండదు పన్నులు యివ్వడం అంటే రైతుకు ఒక పెద్ద భారమైన విషయంకాదు నిజంగా రైతులయొక్క కష్టార్జితం ఫలించి పంటలు పండాలి గాని, పంటలు బాగాపండి తమకష్టం ఫలించినట్లయితే సామాన్యమైన స్వల్పమాత్రపు పన్నులు యిచ్చుకోడానికి రైతులు వెనుకంజ వేస్తారని నేను ఎప్పుడూ అనుకోవడంలేదు కాని, పంటలు పండక, తమ కష్టం ఫలించకపోతే, పన్నులు యిచ్చుకోవలసిన పరిస్థితి వచ్చినప్పుడే వారికి చాలా కష్టంగా వుంటుంది దానికి ప్రభుత్వంవారు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయవలసియున్నది ఈ సంవత్సరం మన దేశంలో వాతావరణస్థితి అంత బాగాలేదు కేవలం వర్షాల మీద ఆధారపడినపంటలు మెట్ట ప్రాంతాలే అయినా, మాగాణి ప్రాంతాలలో కూడ అధిక వర్షాలవల్ల, అనావృష్టివల్ల దెబ్బతిని నష్టపడిన విషయం మనందరకూ తెలుసును పంటలు పండకపోతే వారికి remission యిస్తాము కదాయని ప్రభుత్వంవారు చెబుతారు అయితే, remission rules సక్రమంగా లేవు ఆ భూములలో 2 అణాల పంటలు పండితే వారికి remission లేదు, ఒకవేళ కొన్నింటికి remission వచ్చినప్పటికీ, అది గ్రామ కరణాలమీద, రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లమీద ఆధారపడి వుంటుంది. వారు సరిగా వ్రాస్తే వుంది, లేకపోతే లేదు ఒకవేళ వారు వ్రాస్తే ఈ remission వారికి ముడుపులక్రింద ముట్టచెప్పుకోవలసిన అవసరం కలుగుతుంది కదా ! కాబట్టి దీని విషయమై ప్రత్యేకంగా ఏదైనా ఏర్పాటు చేసేందుకు ఆలోచించాలని కోరుతున్నాను

ధాన్యాగారం అని చెప్పబడే కృష్ణాజిల్లాలో తిరువూరు తాలూకా ఉన్నది ఆ తాలూకాలో యీ సంవత్సరం మెట్ట, మాగాణి పంటలన్నీ పోయాయి తిరువూరు తాలూకా surplus taluk అని ప్రభుత్వంవారి లెక్కలలో ఉన్నది నిజమే. ఆ తాలూకాలో 5, 6 వందల చెరువులున్నాయి. ఆ చెరువులనుంచి భూములకు నీరువచ్చి పండినప్పుడు అది surplus తాలూకాయే. వర్షాలు లేకపోవడంవల్ల ఈ సంవత్సరం పంటలు బొత్తిగా పోయినాయి. ఏ చెరువులో చూసినా నీరులేదు. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామాత్యులైన శ్రీ నర్సింగరావుగారు క్రిందటినెల 22వ తేదీన మా నియోజకవర్గంలో పర్యటన చేయడం తటస్థించినది. వారు 14 స్థలాలలో ఆగి ఉపన్యాసాలు

చేశారు అన్నిచోట్ల కూడా అక్కడి రైతులంతా వచ్చి మా పంటలన్నీ పోయాయి, చెరువులలో నీరులేదు, ఇంతవరకు పైరులు పెంచుకున్నాము, ఇప్పుడవి ఎండిపోతున్నవని విజ్ఞప్తి చేసుకున్నారు ఒకచోట ఒక రైతువచ్చి "నేను యిప్పటివరకూ చెరువులోని నీటివల్లమాగాణి పెంచుకున్నాను, తీరా ఫలించబోయే సమయం వచ్చేటప్పటికి చెర్వులో నీరు అయిపోయింది, ఇప్పుడు నేనేమి చేయాలి, ఆత్మహత్య చేసుకోవలసిన పరిస్థితి యేర్పడ్డది" అని మంత్రి గారికి విచారంగా చెప్పుకున్నాడు పాపం ఇటువంటి పరిస్థితులలో remission యిచ్చే rules ను జాగ్రత్తగా apply చేయాలి అంతేకాకుండా వేరుశనగ పండించే మెట్ట ప్రాంతాలను కూడా పర్యటన సందర్భంలో మంత్రిగారు చూచారు ఒక ఫర్లాంగు రెండు ఫర్లాంగుల దూరంనుంచి నీరు తెచ్చుకని పొలం తడుపుకొని వేరుశనగను పీకుతున్నారు ఆ విధంగా కష్టపడినా కూడా వేరుశనగ పంట రాకుండా ఉన్నది కాబట్టి ఆ పంట ఎంతపండినది, అసలు పండినదా, లేదా, పండినకాస్తా వారి ఖర్చులకు సరిపోయిందా, యిపుడు అధిక శిస్తులు చెల్లించగలరా, లేదా అనే విషయాలు కూడా ప్రభుత్వంవారు ఆలోచించి పన్ను వసూలు చేయాలి

మరొక విషయం మనవి చేస్తున్నాను Prohibition తీసేయాలని చాలా మంది చెప్పారు ఇదిచాలా అన్యాయమైన విషయం కాంగ్రెసువారే కొందరు యిట్లాచెప్పడం చాలా విరుద్ధము. వారు ఎట్లా చెప్పగల్గుతున్నారా అని నాకు ఆశ్చర్యం కలుగుతున్నది Prohibition అనేది fail అయిపోయిందంటున్నారు దానికి నేను అంగీకరించుట లేదు, fail అయిందని నేను అనుకోవడంలేదు. ఇది success అయిందనే నా అభిప్రాయం దానివల్ల దేశంలో వుండే బీదవారు, చిన్నవారు, లేబరర్సు, కూలీలు అంతాకూడా లాభం పొందుతున్నారు కాని Illicit distillation జరుగుతోంది, చాలామంది త్రాగుతున్నారంటున్నారు, వారిని త్రాగితే త్రాగనివ్వండి, కాని దానివల్ల ఎవరికీ లాభంలేదని చెప్పడం చాలా అన్యాయం Prohibition తీసేయాలనేవిషయం అసలు తలపెట్టకూడదు. మళ్ళీ ఈ దేశంలో సారా, కల్లు త్రాగించి, దానిమీద వచ్చేడబ్బుతో దేశాన్ని అభివృద్ధి చేసుకోవాలనే ప్రయత్నం కూడ నేకూడదు ఆ విషయం అసలు తలపెట్టనేకూడదు ఈ విషయమై తగు విమర్శనలను లక్ష్యం చేయవద్దని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను.

మరొకవిషయం, ఈ పన్నులు వేయడంలో ఒక ఆహారపుపంట, ఇంకొక వాణిజ్యపుపంట కలిపి వేసినప్పటికీ ఆ భూమిపై వాణిజ్యపంటకు మాత్రమే పన్ను వేస్తామన్నారు.

అయితే ఆహారధాన్యాల పంటలు ఎక్కువగా ఉండి తక్కువగా వాణిజ్యపు పంటలున్నపుడు, అటువంటివాటిని వదలిపెట్టవలసినదని ఈ విషయం Select Committee లో ఆలోచించవలసినదని మంత్రిగారిని కోరుతున్నాను

[ *Sri S Ranganatha Mudaliar in the Chair* ]

శ్రీ వి గోపాలకృష్ణ (పిఠాపురం) అధ్యక్షా ! మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ బిల్లును బలపరుస్తూ Select Committee వారిని, ఈబిల్లు పరిశీలన సమయంలో ఈవిషయాలను కొంచెం పరిశీలించమనికోరుతూ, కొన్ని సూచనలనుచేస్తున్నాను వాస్తవికంగా రెండవ పంచవర్ష ప్రణాళికకు కావలసినటువంటి డబ్బును మనం సంపాదించడానికి ఈ పన్నులు వేసుకొంటున్నాము ఈ వేసేటటువంటి పన్నుల వల్ల వచ్చేటటువంటి అధిక రాబడులతో ఇంకా పురోగమిస్తూ, ఇంకా అధికంగా పన్నులు వేసుకొని ఇంకా మంచి పనులు చేసుకోవాలి 3 వ పంచవర్ష ప్రణాళి కకు కూడా provision చేసుకొంటున్నాము కాని ఈ పెరుగుచున్నటువంటి కార్యకలాపాల్లో వచ్చినటువంటి లాభం ఎంత ? అని మనం సమీక్షచేసుకొనేట ట్లయితే మనం ఆశించినంతమటుకు కూడా లేకపోవడం సరికదా, హెచ్చుగా దుబారా ఔతున్నదనేటటువంటిది చాలా విదితమైనటువంటి అంశం ఈవిషయం లో ప్రభుత్వం చాలా గట్టి చర్యలు తీసుకోవలసివస్తుంది ఎందుచేత వారు ఈ విషయంలో తగు శ్రద్ధ వహించడం లేదోకూడా తెలియకుండా ఉంది శ్రద్ధ వహించడం లేదని చెప్పడానికి కారణమేమిటంటే Estimates Committee వారు యిచ్చినటువంటి రిపోర్టును ప్రధానంగా యిపుడు చూచినట్లయితే, 4 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టినటువంటి K C Canal మీద...

శ్రీ కె. వెంకటరావు · ఆ subject మీద ఇపుడు మాట్లాడవలసిన అవసరం లేదు. దానికి వేరే చర్చ వస్తుంది ఇపుడు దీనిలో ఏవో suggestions Select Committee కి చెప్తానన్నారు అవేవో చెప్పండి ఇపుడు దీనికి ఉపయోగిస్తాయి

శ్రీ వి. గోపాలకృష్ణ నేను మనవిచేసేది. ఆ రిపోర్టును ఈసభలో ఇపుడు తర్జన భర్జన చేయడానికికాదు 4 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టినప్పటికీ మనము దాని మీద హెచ్చు వడ్డీ ఇచ్చుకుంటున్నదే కాక దానివల్ల రాబడి లేకపోవడం మూలాన కొద్ది సంవత్సరాల వరకు కూడా అది ఎటువంటి return లేని expenditure అవుతుంది Return లేనటువంటి expenditure చేయడం విషయంలో తగు పొదుపరితనాన్ని అనుసరించినట్లయితే అవి early గా returns యిస్తుం టాయి అలాంటివాటికి ఈ డబ్బును ఉపయోగించినట్లయితే చాలా బాగుం టుందని మనవిచేయుచున్నాను. రెవిన్యూమంత్రిగారు ఈ పన్నులను వేయడంతో

వారు ఏ ఒక్క అంశంమీద పన్ను వేశారో, దేనికి తగుల్తుందనే విషయం ఎవరికీ అంతుచిక్కడంలేదు Water tax ను పెంచడమే కాకుండా దానిమీద పరోక్షంగా, Local Development Cess, Educational Cess కూడా పెరిగినందువల్ల వారు అనుకొన్నటువంటి 40 లక్షలో, 50 లక్షలో నీటితీరువ వల్ల వచ్చే డబ్బు మాత్రమే కాక, 25 లక్షలు అదనంగా ప్రజలు పన్నుల ద్వారా చెల్లిస్తున్నారు. వారు చెప్పినదాంట్లో యింతవరకూ ఉన్న పన్నుల వల్ల మనకు ఇంత తక్కువ రాబడి వస్తోంది, మనకు రావలసిన రాబడికి మనం ఇంకా పన్నులను వేసుకోక తప్పదని చెప్పారు కాని ఈ పన్నుమీద అదనంగా ఇవ్వవలసినది కూడా వారు తెలియపరచడం లేదు అది వారికి తెలిసిఉన్నదే ఈ విధంగా ప్రజలకు ఈ హెచుపన్నుల వల్ల భారం కల్గుతోంది ఈ పన్నులవల్ల భారం కల్గినందువల్ల వచ్చినటువంటి ప్రయోజనం శూన్యంగా ఉంటోంది

Cess ముఖ్యంగా చెఱకు పంటమీద ఎక్కువగా విధించబడుతుంది చెఱకుపండించే రైతాంగం cess ద్వారా టన్నుఒకటికి indirect గా ఎకరానికి 60 రూపాయలు మొదలుకొని 125 రూపాయల దాకా ఇచ్చుకుంటున్నారు దీనిని factory వారిదగ్గరనుంచే వసూలుచేసినప్పటికిని, చెఱకుధర నిర్ణయించడం పంచదార ధరను నిర్ణయించడంలో యిమిడిఉన్నది దామాషాన 20 టన్నులు మొదలు 25 టన్నుల వరకు ఎకరానికి చెఱకు పంట పండుతుంది మూడు రూపాయల చొప్పున cess విధిస్తూంటే సుమారుగా ఎకరానికి 75 రూపాయలో 80 రూపాయల దాకానో పడ్డది అంతేకాకుండా అదనంగా, ఇంకొక 5 రూపాయలు వేస్తున్నారు చెఱకు పంటవల్ల కొంచెం అధికరాబడి రావడం నిజమే దానివల్ల కొంతకాకపోతే కొంతైనా State కు యివ్వవలసిన బాధ్యతకూడా వారిమీద ఉండడంకూడా భావ్యమే. కాని ప్రభుత్వం చెఱకు ఉత్పత్తికి కారణమైనటువంటి ప్రధాన విషయములలో తగినంతశ్రద్ధ తీసుకొనడం లేదు చెరకు రవాణా విషయంలో కూడా ప్రభుత్వం ఏవిధమైనటువంటి శ్రద్ధ తీసుకోవటంలేదు ఈ cess fund ను వారు ప్రతి సంవత్సరం వారిదగ్గనుంచి వసూలు చేసుకోవడమే కాని అక్కడ రవాణా సౌకర్యములను ఏమీ చూడడం లేదు ఉదాహరణకు ఒకవిషయం చెప్తున్నాను. ఒక Executive Engineer గారు తమ జీప్ కారుతోటి ఒక రోడ్డును తనిఖీచేసి estimates వేద్దామని వెడుతూండగా ఒక గోతిలో ఆ జీప్ పడిపోతే ఆ జీప్ కు 4 పోతులను కట్టించి బయటికి లాగించవలసివచ్చింది. అటువంటి అధ్వాన్నపు condition లో ఉన్నటువంటి రోడ్లలో వచ్చేటటువంటి చెరకును ఏవిధంగా రైతాంగం factory కి తక్కువ ఖర్చులతోటి ఇచ్చి ప్రభుత్వానికి పన్ను యివ్వకల్గుతుందో ఆలోచించ

మని కోరుతున్నాను రెండవదేమిటంటే కొబ్బరి, నిమ్మ మొదలైనవి తోటలు, వేరుశెనగ, పసుపు, మిర్చి మొదలైనవి ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం తీసేసే పంటలు ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం పండేటటువంటి పంటలలో అప్పుడు వచ్చిన లాభనష్టాలతోటి ఆపన్ను ఎంతో తేలిపోతుంది ఒక కొబ్బరితోట వేసుకుంటే దానికి 3, 4 సంవత్సరములు పోషణ చేయాలి నిమ్మతోట వేసుకుంటే 4, 5 సంవత్సరాలు దానికి పోషణచేసి కష్టపడి దానికి పెట్టుబడి పెడుతున్నాము, కాని ఫలితం వెంటనే రాదు కాని తోటవేసిన మరుక్షణంనుంచీ కూడా పన్ను యిచ్చుకోవడం తప్పడంలేదు అట్టివిధంగానే కొబ్బరితోటలమీద వచ్చే ఆదాయం కూడా ఉంటుంది పన్నులు ఆ విధంగానే చెల్లించాలి వేరుశెనగ మొదలైనటువంటి పంటలవలెగాక, pests, వాతావరణపు conditions, cyclone వగైరా ఒత్తిడికి తట్టుకుంటూ, దెబ్బలు తింటూ ఒక సంవత్సరం కాస్తే ఒక సంవత్సరం కాపులేకుండా ఆ ఏటి పెట్టుబడిఖర్చులు కూడా రాకుండా ఉండేటటువంటి పంటలివి ఈ పంటలమీద మొదటినుంచీ పన్నును వేయడం చాలా శోచనీయమైన విషయం అలా వారు వేయకుండా వీటిని మినహాయించటానికి Select Committee వారు ఆలోచించితే చాలా బాగుంటుందని కూడా నేను చెప్తున్నాను గౌరవనీయులైన మంత్రిగారు చెప్తూ పొలాలలో గట్లమీద వేసిన కొబ్బరిమొక్కలకు మినహాయింపు వస్తుందన్నారు. అంతేకాదు, మెరక భూములలో కూడా, తోటలువేసిన మెరక వ్యవసాయపు భూములకు చుట్టూరా కోరడిగట్లమీద వాణిజ్యపు పంటలకు కాని, ఇతరపంటలకు కాని, ఎటువంటి నష్టం లేకుండా ఎదోఒక కడనుండి కొంత కాకపోతే కొంతైనా అదనపురాబడి సౌకర్యం కల్గుతుందనే ఉద్దేశ్యంతో కొబ్బరిమొక్కలను కూడా వేస్తూఉంటారు ఒక మామిటతోట వేసినట్లైతే వాటిచుట్టూ కొబ్బరిమొక్కలు వేస్తూంటారు అటువంటివికూడా Select Committee వారు ఆలోచించి అలాంటి వాటినన్నిటినీ మినహాయింపు చేయాలని కోరుతున్నాను హెచ్చుగా మెట్టపేద్యంలో ఒక వాణిజ్యపంటను ఆహారపంటతో కలిపో, రెండు వాణిజ్య పంటలు కలిపో వేస్తూంటారు వేరుశెనగ, ప్రత్తి కలిపి, వేస్తూంటారు బుడమ, ప్రత్తి కలిపి వేస్తూఉంటారు అపుడు అది కేవలం supplemental income కోసమే కాని, అది ముఖ్యమైన పంట కాదు ఇపుడు బిల్లులో చూచినట్లైతే వేరుశెనగ, ప్రత్తి కలిపి పెట్టినపుడు ఈ వాణిజ్యపు పంటలలో. ఈ రెండింటిలో ఏదైతే అధిక పన్ను గల పంట ఉన్నదో ఆ పంటమీదనే ఆ ఎక్కువ పన్నును వసూలు చేస్తామంటున్నారు. అధికంగా పెట్టినటువంటి పంటను అంతా కలిపి ఊడపీకి మళ్ళీ మనం ఊడ్చినట్లయితే ఒక 5 సెంట్లు అయినాకూడారాదు. అలాంటపుడు బుడమపంటమీద వచ్చేరాబడే రాబడి కాని

ప్రత్తిమీద అంతగా వచ్చేదేమీలేదు ఒక వేళ వచ్చేదేమైన ఉన్నప్పటికి కూడా అది ఆ కుటుంబానికి కావలసినటువంటి నిత్యావసరమైన ఒక పరుపుక్రింద, రెండు చెక్కాలుక్రింద కుట్టించుకోడానికి పనికివస్తుంది కాని మార్కెట్ కు తీసుకు వెళ్ళి అమ్ముకొనే అంతటి produce రాదు కనుక దానిమీద ప్రభుత్వం ఇలాంటి పన్నులు వేయడం అంతమంచిదికాదు Select Committee వారు ఈ విషయము కూడా చూస్తారని అనుకుంటున్నాను పన్నులు వేయడం, ప్రజల వద్దనుంచి డబ్బు వసూలు చేయడం ఈ పన్నులను ప్రభుత్వం, ప్రజల అవసరాలకు ఖర్చుపెట్టడం సబబైన విషయము అని ఆర్థిక నిపుణులు వ్రాసినటువంటి విషయం పన్ను యిచ్చిన ప్రతి ఒక్కడూకూడా నేను ఇచ్చిన పన్నుకు ఏమి చేసినావు ? అని అడిగితే State కు జవాబు చెప్పడానికి obligation లేదు అయినప్పటికి సంఘం మొత్తంమీద కాని, ఒక ప్రాంతం మొత్తంమీద కాని ప్రభుత్వం వాటిని సద్వినియోగం చేయడమనేది చాలా ముఖ్యం అనే విషయాన్ని మనస్సులో పెట్టుకొనేవారు పన్నులు వసూలు చేస్తున్నామనే సంతృప్తికాకుండా మీరు వేసినటువంటి పన్నుల్ను సద్వినియోగ పరచి ఆయా ప్రాంతాల్లో మీరు, ఏమేమి పనులు చేశారో వానివల్ల ఫలితం మీ ప్రభుత్వానికి రావడానికి అనుగుణ్యంగా ఉండేటట్లుగా అక్కడ ఉన్నటువంటి ప్రజలకు వారు చేసినపని వెంటనే సౌకర్యం కలుగచేయగలిగినట్లయితే పన్నులు వేయడం ఎంతో ముఖ్యం, దానివల్ల రాబడి హెచ్చుగా రావడానికి కూడా సావకాశం ఉంటుంది ప్రజలు కూడా నైతికంగా బాగుపడడానికి వీలుంటుంది కనుక ఆవిధంగా దీర్ఘంగా ఆలోచించి పన్నులు వేయడం చాలా సమంజసము అంతేకాని ప్రభుత్వంకు వచ్చిన కొరతలను తీర్చడానికే మేము పన్నులు వేస్తున్నాము అనే దృష్టితో మేము మీ కోసం ఖర్చుపెడుతున్నాము అని ద్వితీయ పంచవర్ష ప్రణాళిక యొక్క సాకు ఒకటి తీసుకువచ్చి చెబుతున్నారు కాని ఆ వేసినటువంటి పన్నులు ఏ విధంగా ప్రజలకు returns యిస్తున్నాయి ? అనే సంగతిని కూడా కొంచెం బాగా ఆలోచించ మని నేను ప్రభుత్వంవారిని తమద్వారా కోరుతున్నాను,

*శ్రీ డి. వెంకటరమణారెడ్డి (దరిశి) : అధ్యక్షా, జూలై నెల ఒకటవ తేదీలో ప్రారంభమయ్యేటట్లుగా రెవిన్యూ మంత్రిగారు (commercial crops మీద పన్ను వేసేటటువంటి) బిల్లును తీసుకొని వచ్చారు వారు యీరోజున ప్రవేశపెట్టిన బిల్లుతోసహా రైతులమీద పన్ను వేసే మూడు బిల్లులు తీసుకొని రావడం జరిగింది. అయితే యీ మూడు బిల్లులుకూడా పంట గ్యారంటీలేని మెట్ట ప్రాంతాలవారి మీదనే హెచ్చుగా ఉండేటట్లు కనపడుతున్నది పంట

గ్యారంటీగా పండేవాళ్ళమీదకన్నా పంటలు సరిగా పండని మెట్టప్రాంతాల వారిమీద యీ పన్నుల భారం హెచ్చుగా పడుతుంది ఆ ప్రాంతాలలోనివారే యీ పన్నులవల్ల హెచ్చు కష్టపడుతారని మనవి చేస్తున్నాను అదనపు పన్నుల వల్ల డెల్టా ప్రాంతాలవారికి హెచ్చు కష్టం ఉన్నట్లుగా తోచదు ఇప్పటికే 12 13 రూపాయల పన్ను వున్నగోదావరి, కృష్ణాడెల్టాలలో యీ అదనపు భారం హెచ్చుగాఉండదు కాని మెట్ట ప్రాంతాలలోని నీటివసతి లేనివారిని ఆ స్థాయికి తెచ్చుటచే రైతులు ఎంతో భాధపడవలసివస్తుందని ప్రభుత్వంవారి దృష్టికి వచ్చినట్లు కనపడదు ఆ విధంగా పేద రైతాంగంమీద పన్నులు పడకుండా అనేకమంది సభ్యులు alternative suggestions తెలియజేసియున్నారు కాని వాటిని మంత్రిగారు మనస్సుకు తీసుకోనందుకు విచారముగా ఉన్నది ఇన్ని అదనపు పన్నులు రైతులమీద విధించి నూటికి తొంభై మంది రైతులు ఉన్న మనదేశంలో వారి ఆదరణను పోగొట్టుకోవడం న్యాయంకాదు రైతులకు సరి అయిన సంఘాలు లేనందువలన వారు ఎన్ని పన్నులు వేసినా తలతాకట్టుపెట్టి ఇచ్చుకోవలసి వస్తున్నది వాండ్లు సంఘాలమూలకముగా గోలపెట్టని దోషము వలన వాళ్ల కష్టసుఖాలు మనము గమనించుటలేదు ఈనాడు చేనేతసంఘాలు, రజక సంఘాలు, హరిజన సంఘాలు మొదలైనటువంటి సంఘాలు ఎన్నో ఉన్నాయి. నూటికి పది, ఇరువై మందిగా కూడా వారు లేకపోయినప్పటికి వారు సంఘాలు ఏర్పరుచుకొని ఆందోళన చేస్తున్నందువల్ల వారికి లాభాలు ఎక్కువగా ఉంటున్నాయి కాని రైతులకు సంఘాలు లేని కారణముగా వారికి ఎంత మాత్రం సహాయం జరగడం లేదనేది నిర్వివాదాంశము సహాయము లేక పోతే పోయేననుకున్నా అదనపు పన్నులుకూడ వేస్తున్నారు వేరుశనగ వేస్తే ఎకరమునకు 1-0-0 మిర్చివేస్తే రు 3-0-0 విధించేపద్ధతిని అమలు పరుస్తున్నారు యకరాల ప్రాతిపదిక వేయుటలో మెట్టప్రాంతములలోకూడా ఒకచోట ఎకరం ధర 5, లేక 6 వేల రూపాయలుంటే మరికొన్నిచోట్ల నూరు రూపాయలుకూడా ఉండని ప్రాంతాలు ఉన్నాయి కాని వీటన్నిటిమీద ఒకేరకమైన పన్ను విధించ డం ఏవిధంగా భావ్యమో నాకు అర్థంకావడంలేదు ఎన్నిసార్లు చెప్పుకొన్నా మామాట ఎవరూ వినడంలేదు చక్కగా పంటలుపండే భూములున్న డెల్టా ప్రాంతాలవారితో సమానముగా మెట్టప్రాంతాల వారిమీద ప్రతి పన్నులు వేయ డం న్యాయంగాలేదు నిష్ప్రయోజనమైన భూములు కలిగి తిండికి, గుడ్డకు నోచుకోని మెట్ట ప్రాంతములలోని రైతాంగం పడుతున్న బాధలను గురించి ఎంతదూరం చెప్పుకొన్నా ఫలితం కనపడడంలేదు. అదనపు పన్నులను బక్కచిక్కిన రైతుల మీదనే విధిస్తున్నారు గాని ఇతర వర్గాలవారిమీద హెచ్చుగా యేమి పడడంలేదు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను జయప్రదం

చేయడానికి రైతాంగం త్యాగం చేయవలెనని అంటున్నారు పన్నుభరించమని చెబుతున్నారు కాని ఇతర వర్గాల వారి మీద ఆ భారం హెచ్చుగా పడుటలేదు ప్రణాళికను అమలుజరిపే విషయంలో కూడా బాగా develop అయిన ప్రాంతాలకే హెచ్చులాభం కలుగుచున్నది. కాని వెనుకబడిన ప్రాంతాల వారికి అంత ప్రయోజనం కనబడుటలేదు Backward areas కు developed areas కు ఒకే పద్ధతిని కంట్రిబ్యూషన్ ఏర్పాటుచేయడం వల్లనేమి కాని, శ్రమదానంకాని ఇచ్చేవిషయంలో ఒకే విధానం అవలంబించడంవల్ల వెనుకబడిన ప్రాంతాలవారు ఇవ్వజాలనందున లాభం కలుగుటలేదు వాటికి లేని వారు డబ్బుగాని, శ్రమదానం గాని యీయలేక పోతున్నారు అందువల్ల బీద ప్రాంతాలకు పల్లపు ప్లానింగు లాభములేక బాగున్న ప్రాంతాలలోనె పనులు జరిగి అదనపు శిస్తులు విధించడం జరుగుతున్నది ప్లానింగుకు సంబంధించిన నిబంధనలు బీద ప్రాంతాలకు మరియొకవిధముగా చేయమంటే "అది మన పనికాదు కేంద్ర ప్రభుత్వం వారు నిర్ణయిస్తారు కనుక మనం వాటిని మార్చరాదు" అంటున్నారు అది ఎంతమాత్రం న్యాయమైన విషయంకాదు

ఇక ఆయా నియోజక వర్గాలలో వసూలు చేసే విషయంలో కూడా న్యాయంలేదు యం యల్ ఎ లలోకూడా ఒక gradation ఉన్నట్లు కనబడు తున్నది ఎవరు నోరుకలవారో, ఎవరు మంత్రులవద్దకు వెళ్ళి బూటకపు కబుర్లు చెప్పగలరో వారికి సంబంధించిన పనులే జరుగుతున్నాయి తక్కిన చోట్ల పనులు ఎక్కడ ఎలా ఉన్నవి అలాగనే ఉంటున్నవి. గ్రామీణ ప్రాంతాలలోని ప్రజల కష్ట, సుఖాలు తెలుసుకొని వారికి సహాయం చేసేదానికి మారుగా సంవత్సరానికి నాలుగైదు పన్నులు వారి నెత్తిన వేయడం జరుగుతున్నది మా తాలూకాలు చాలా వెనుకబడి ఉన్నవి ఎకరం 20 రూపాయలు ఖరీదు చేసే భూములు కూడా ఉన్నాయి అయిదు మాసములుగా వర్షములు లేక బ్రహ్మాండమైన కరువు పరిస్థితులు ఏర్పడి ఉన్నవి, ఆరుద్ర కార్తిలో వర్షాలు కొద్దిగా కురిసినా తరువాత వర్షాలు లేనందువలన మెట్ట పైరులు కూడా ఎండిపోయినాయి రైతులు గడచిన సంవత్సరం తాలూకు గింజలు కూడా అయిపోయినందువలన వారి పశువులను సుభిక్ష ప్రాంతాలకు తీసుకొనిపోయి అమ్మి ఆ డబ్బుతో గింజలను తెచ్చుకొని బ్రతుకు తున్నారు ఇటువంటి పరిస్థితులలో వాళ్ళకు రిలీఫ్ ఇవ్వడంలేదు సరిగదా వారిమీద అదనపు పన్నులు వేస్తూ ఉండడం వలన వారి ఎదుటకు పోవడానికి కూడా మేము భయపడవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి

Commercial crops పై పన్ను విధించే విషయంలో రెండు పైరులు భూమిమీద వున్నప్పుడు - రెండు పైరులమీద పన్ను వేయడం సబబుకాదు సాధారణంగా వేరుశనగ, ప్రత్తి కలిపి పైరుచేస్తారు వీటిలో వేరుశనగ ముఖ్యమైన పంట, పత్తి కర్రలు అక్కడక్కడ మాత్రమే ఉంటాయి కాబట్టి వేరుశనగమీద మాత్రమే పన్నువేయాలి ఈ విషయంలో స్పష్టమైన ఉత్తరువులు యీయకపోయినట్లయితే రైతులు విలేజి ఆఫీసర్సు చెప్పినట్లు పన్నులు ఇచ్చుకోవలసి వస్తుంది

ఈ అదనపు పన్నులవల్ల బాక్‌వర్డు ఏరియాస్ ఎఫెక్టు కాకుండా ఉండేట్టుగా వాటిని ఎక్జంప్టు చేయమని, పంట గ్యారంటీగా ఉన్న జిల్లాలలోనే దీనిని అమలు చేయమని మనవిచేస్తున్నాను పన్నులు వేయడమే కాని పనులు చేయక పోయినందువలన ప్రజలు చాలా బాధ పడుతున్నారని, వారికి కొంత సౌకర్యము కలుగజేయవలెనని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ అమృతలాల్ శుక్ల (శిరిసిల్ల-జనరల్) అధ్యక్షా! స్వాతంత్ర్యం వచ్చిన పదిపండ్ల తరువాత రెండవ పంచవర్ష ప్రణాళిక అమలుజరిపేటప్పుడు యీ పన్నులు వేసుకుంటున్నాము అయితే ప్రతిపక్షంవైపు నుంచి ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపాలని కోరుతున్నాము ఇదే కాదు ఇంతకుముందు వచ్చిన సర్‌ఛార్జీ బిల్లుకూడ ప్రజాభిప్రాయానికి పంపాలని మేము కోరాము ఈ పన్నుల బిల్సును ప్రజాభిప్రాయానికి పంపవలెనని మేము ఎందుకు అభిప్రాయ పడ్డామో అది ట్రెజరీబెంచెస్‌వారికి అర్థంకావటంలేదు అయితే ఆహార పరిస్థితులు మాట్లాడేటప్పుడు మంత్రిగారు చెప్పారు నటీనటులు ఒకరే అయినా, సినీమాలో, డ్రామాలో అనేక వరసలతో ముందుకు వస్తారు అదేవిధంగా ప్రతిపక్షం కూడ వస్తుందని వారి అభిప్రాయం ప్రతిపక్షం అదేవిధంగా ఉంటే, ఈనాడు జనానికి, ప్రభుత్వానికి ఏమి గతి పట్టేదో వారికి అర్థంకాలేదు. ప్రతిపక్షం ఆ పరిస్థితిలో లేదు కనుక దేశం అధోగతిపాలు కాకుండా ఈనాడు యీ పరిస్థితులలోనైనా నిలబడి ఉన్నది ఒకప్పుడు వెంకటరావుగారు చెపుతూ వచ్చారు— టాక్సేషన్ ఎంక్వైరీకమిటీని వేశామని, పని సాగుతోందని, ఇపుడు ప్రణాళికలు నడుపుకోవాలంటే, బండి సాగాలంటే, పన్నులు వేయాలని అన్నారు పన్నులు వేసే పాత వారసత్వం మనకు ఉన్నది అయితే రాజకీయ స్వాతంత్ర్యం వచ్చి పది పండ్లయిన తరువాత రెండవ పంచవర్ష ప్రణాళిక వేసి ముందుకు సాగేటప్పుడు కూడ పాత వారసత్వాన్ని పట్టుకొని ముందుకు పోవలసిన అవసరం ఏర్పడింది ఆర్థికమంత్రిగారు బడ్జెటుసెషనులో ఒక విషయం స్పష్టంగా చెప్పారు వారు మా స్థానంలో ఉండి, మేము వారి స్థానంలో ఉంటే

ఏవిధంగా ఉంటుందో గమనించాలని అన్నారు వాస్తవమే ప్రతిపక్షం వైపు నుంచి విమర్శలు వస్తే వారికి అనుగుణంగా ఉన్నవి తీసుకుంటారు, లేనివి విడిచి పెడతారని స్పష్టంగా చెప్పారు ప్రతిపక్షంవారు ట్రెజరీ బెంచెస్‌లోకి వెళ్ళినా ఆవిధంగానే చేస్తారని వారు చెప్పారు ఆ భేదం ఉండబట్టే ఈవిధంగా రెండు పక్షాలు ఉన్నవని వారు చెప్పారు చాలామంచిది ప్రజలు కూడ అర్థముచేసుకొనుటకు బాగా తోడ్పడుతుంది పన్నులు వేయుటలో ప్రభుత్వం ఏవిధంగా ఆలోచిస్తున్నదో, ప్రజల ప్రభావం ఏవిధంగా ఉంటున్నదో గమనించాలంటే ఒక విషయం చూడాలి వెంకటరావు గారి సర్‌ఛార్జీ బిల్లు విషయంలో మాట్లాడేటప్పుడు ట్రెజరీబెంచ్ నుంచి దానిని బలపరుస్తూనే, దానికి వ్యతిరేకంగా ప్రతిపక్షం కన్న ఎక్కువ విమర్శించారు ట్రెజరీ బెంచెస్ విమర్శలు చూస్తే వారు చెప్పిన కామన్‌విషయాలు తీసేస్తే, వారు బిల్లును బలపరచిన మాటలు చిన్న బ్రాకెట్‌లో ఇరుక్కుపోతాయి ప్రభుత్వం యీవిధంగా బ్రాకెట్‌లో యిరుక్కొనిపోయి ఈ పన్నుల విధానం సాగిస్తే దేశాన్ని ఏవిధంగా బాగుపరచవలచుకున్నదో ఆలోచించవలసియున్నది

ఇప్పుడు కమర్షియల్ క్రాప్సుపై పన్నులు వేయబడినాయి ప్రస్తుతం పన్నులు వేసుకొంటూపోవలసియున్నదని మంత్రిగారు చెప్పారు కాని అందులో కొన్ని సవరణలు చేయుట అవసరమా, లేదా అనే సమస్య ఉన్నది వారితో మేము ఏకాభిప్రాయానికి రాలేకపోయినా, వారి పద్ధతి ప్రజలకూ, దేశానికి ఉపయోగపడేటట్లు చేయవలసిన అవసరంఉన్నది ఈ సర్‌ఛార్జి గ్రేడెడ్ పద్ధతిని వేయబడినదని, చాలా ప్రోగ్రెసివ్‌గా ఉన్నదని మంత్రిగారు చెప్పారు ఈగ్రేడెడ్ విధానం అందరూ అనుకొన్నట్లు వేయబడిందని. దీనిని ఏకగ్రీవంగా మంజూరు చేయాలని కోరారు. కాని ఆ గ్రేడేషన్ విధానంలో ఏమి ఉన్నదో, ప్రతిపక్షం విమర్శిస్తూ వచ్చింది ఎక్కువ లాభాలు సంపాదించేవారిపై ఎక్కువ పన్ను వడ్డే కన్న, బీదవారి మీద అనేక అసౌకర్యాలతో వ్యవసాయం సాగిస్తూ ఉండే వారి మీద ఎక్కువపడేటట్లు బిల్లు ఉన్నదని బయట ప్రజలు గుర్తిస్తున్నారు ఆ అభిప్రాయం కాంగ్రెసుపక్షం నుంచి కూడ ప్రతిధ్వనిస్తోంది ఈవిధంగా పన్నులు విధిస్తూ పోతుంటే ప్రజానీకమునకు యిక్కడనుంచి బయటకు పోయినతరువాత చెప్పుట కష్టముగా ఉన్నది. కొంతమంది మంత్రులు జవాబుచెప్పుకొనగలరేమో గాని, చాలామంది ప్రజాప్రతినిధులు, ప్రజలకు జవాబుచెప్పలేకుండా ఉన్నారని గుర్తించవలసిన అవసరంఉన్నది ఈ కమ్మర్షియల్ టాక్సు వల్ల 50, 60 లక్షలు ఆదాయం వస్తుందని అనుకొంటున్నారు. వాస్తవంగా యిది సేల్సుటాక్సు అయిన తరువాత రెండవరకమైన పన్నువిధానం కమ్మర్షియల్ క్రాప్సుకు ఖర్చు

ఎక్కువ పెట్టినా లాభం ఎక్కువ వస్తుందని చెప్పారు నిజమే, లాభం వస్తుంది కాని ఈ పంటలు పండించుటకు ఏమి యిబ్బందులున్నవో, రైతులకు ఏమి సౌకర్యములు కావలెనో, ఈసభలో అనేకసార్లు చెప్పబడింది తెలంగాణాలో సర్ఫెఖాస్, దాదాపు నూటికి 44 వంతులు ఉన్న ఇలాకా వెనుకపడిఉన్నది చెరువులలో నీరులేక సేద్యంచేయుటకు రైతులు అనేక తంటాలుపడుతూవచ్చారు కాని ఈనాడు వారిపై పన్నులు ఎక్కువ ఉన్నవి ఆంధ్రలో కూడ వ్యవసాయములో వెనుకపడిన ప్రాంతములు ఉండవచ్చును ఆంధ్రతో తెలంగాణాన్ని పోలిస్తే ఇక్కడ ఉత్పత్తి చాలా తక్కువ ఇక్కడికన్న ఆంధ్రలో రెండురెట్లు ఎక్కువఅవుతుంది టాక్సులు చూస్తే తెలంగాణాలో 1½ రెట్లు ఎక్కువ పడుతున్నాయి నీటి విషయంలో ఇక్కడ పెద్ద ప్రాజెక్టులు లేవు గుంటలనుంచి, బావులనుంచి ఏతాం వేసి తీసుకొంటూ నానాకష్టాలుపడి పంటలు పండిస్తున్నారు మిరపకాయలు, పసుపు-అన్నీకలిపి యిక్కడ వ్యవసాయంచేసే సాంప్రదాయం ఉన్నది ఏ కొద్దిగా పన్ను వేసినా అన్నింటికీ కలిపి ఎక్కువపన్ను చెల్లించుకోవలసి వస్తుంది

శ్రీ రంగారెడ్డి (బాల్కొండ) అధ్యక్షా, నేను యీ బిల్లును బలపరుస్తూ కొన్ని సూచనలు చేయదలచుకొన్నాను ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ప్రాంతాల్లో చెఱకుపైన విపరీతంగా శిస్తు విధించబోతున్నారు తెలంగాణాలో ఎకరానికి 40 రూ నుంచి 64 రూ వరకు శిస్తు ఉన్నది భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో యీ శిస్తు ఏవిధంగా విధించబడుతోందో చెబుతాను భారత దేశంలో అధికంగా చెఱకు పండేటటువంటి ప్రాంతమైన బీహార్‌లో చెఱకు పైన ఒక ఎకరానికి శిస్తు 6-9-0 విధించబడుతోంది యు పి లో 8-0-0 లు, ఒరిస్సాలో 5-8-0 నుంచి 7-8-0 వరకు, పెప్సూలో 9-14-0, చెఱకుపైన శిస్తు విధించబడుతోంది మైసూరులో చెఱకుపైన శిస్తు ఇదివరకు 15 రూ ఉంటే, ఇప్పుడు దానిని హెచ్చించి 25 రూ చేశారు సౌరాష్ట్రంలో మాసానికి 3 రు. తీసుకొంటున్నారు ఈ విధంగా చూచినట్లయితే తెలంగాణాలో చెఱకు మీద విధించిన పన్ను చాలా విపరీతంగా ఉన్నది అదిగాక, ఇంకా ఇతరపన్నులు కూడ ఉన్నవి ఇప్పుడు, తిరిగి ఎకరానికి ఐదు రూపాయలు అంటే, ఇదివరకే 64 రూ. ఉన్న ప్రాంతంలో పన్నులభారం ఇంకా ఎక్కువైపోతుంది. కాబట్టి, 40 రు కంటె ఎక్కువశిస్తు కడుతున్న ప్రాంతాలను యీ బిల్లునుంచి మినహాయించాలని కోరుతున్నాను భూమి సారంబట్టి కూడ పన్ను విధించబడవలసి ఉన్నది. కాని, జాగీర్ ప్రాంతములోని నిస్సారమైన భూమిమీద పన్ను ఎక్కువగా ఉన్నది సారవంతమైన భూమిమీద తక్కువశిస్తు ఉన్నది. నిస్సారమైన

భూమిమీద ఎక్కువశిస్తు ఉండినది 1955–56 లో, ఆంధ్ర ఏరియాలో గ్రౌండ్‌నట్ ధర రు 15 19 పై ఉండగా, తెలంగాణాలో రు 10 50 మాత్రమే ఉండినది 1954-55 లో, ఆంధ్రలో రు 12 99 పైసలు ఉంటే, తెలంగాణాలో, హార్‌వెస్ట్‌సీజన్‌లో ఉన్న యావరేజ్ ప్రయిస్ రు 5 19 పైసలు ఉన్నది ఇతరపంటల ధర కూడ అదేవిధంగా ఉన్నది రైస్ విషయం కూడ చెబుతాను 1955-56 లో ఆంధ్రప్రాంతంలో రైస్‌ధర రు 16 85 పైసలు ఉంటే, తెలంగాణాలో రు 9 83 పైసలు మాత్రమె ఉండెను 1954-55 లో హార్‌వెస్ట్‌సీజన్‌లో రైస్ యావరేజ్ ప్రయిస్ ఆంధ్రలో రు 15 3 పై ఉంశగా, తెలంగాణాలో రు 6 80 పై ఉన్నది రాకపోకల సౌకర్యం లేకపోవటంవల్లనో, లేక ఏ అవస్థలవల్లనో, హార్‌వెస్ట్‌సీజన్‌లో కూష, తెలంగాణాలో ధరలు విపరీతంగా పడిపోయి ఉన్నాయి ఆ విధంగా చాలా తక్కువధరలు ఉన్న కేష్‌క్రాప్‌లకు యీ బిల్లునుండి మినహాయింపు ఇస్తే బాగుంటుంది

ఇంకొక విషయం ఉన్నది చాలా సారవంతమైన భూములలో పసుపు పండుతుందని సాధారణంగా మనం అనుకొంటూ ఉంటాము కాని తెలంగాణా ప్రాంతంలో చాలా నిస్సారమైన భూముల్లో, ప్రయాసపడి, చెరువులనుండి ఒండ్రు తీసుకొనివచ్చి, దానిని ఫలవంతంగా మార్చుకొని పసుపుపంట పండించు కొంటున్నారు ఆ భూములలో ఏమీ గొప్పతనంలేదు స్వాభావసిద్ధంగా ఆ భూములు సారవంతమైనవి కావు అందుచేత అక్కడిప్రజలు చాలా కష్టపడి, ఆ భూముల్లో పసుపుపంట పండిస్తున్నారు ఇదివరకు పసుపుధర పుట్టి 500, 600 ఉంటే, ఇప్పుడు రు 70 తే ఉన్నది ఇంత విపరీతంగా ధరలు పడిపోయి నపుడు, వాళ్ళమీద ఇంకా పన్ను విధించటం న్యాయం కాదు ఇప్పుడు ఒక రానికి 5 రు పన్ను విధిస్తే, వారికి చాలా ఇబ్బంది కలుగుతుంది నీటి వసతి ఉన్నచోట యీ పన్ను వేసినా నష్టములేదు అక్కడ వారు యీ పన్ను చెల్లించటం కొంచెం తేలికగానే ఉంటుంది. మోటబావుల క్రింద సాగుచేసేవారికి యీ పన్ను చెల్లించటం కష్టంగా ఉంటుంది కాబట్టి అటువంటి వాళ్ళకుకూడ యీ బిల్లునుండి కొంత మినహాయింపు యివ్వాలని నేను మనవి చేస్తున్నాను తెలంగాణాలో ఖుష్కిభూమిలో గ్రౌండునట్స్ పండిస్తున్నారు. తెలంగాణాలో రెండుమూడు రకాల భూములు ఉన్నాయి. మార్జినల్ లాండ్స్, సబ్‌మార్జినల్ లాండ్స్ ఉన్నాయి చల్కా భూములలో రెండు సంవత్సరాలు సేద్యం ఐతే, మూడు నాలుగు సంవత్సరాలు దానిని పడావాగా ఉంచితేగాని దాంట్లో తిరిగి పంట పండదు అట్లా పడావాగా ఉంచకపోతే ఆ భూమిలో చాలా

తక్కువపంట పండటం తటస్థిస్తుంది ఇప్పుడు ఆ భూమిని పడావాగా ఉంచక పంట పండించటం వల్ల తక్కువపంట పండటం జరుగుతున్నది ప్రతి సంవత్సరం వారికి ఖర్చులుకూడ గిట్టుబాటు కావడం లేదు. ఇటువంటి భూములు గల వారినికూడా యీ బిల్లునుంచి మినహాయించాలని నేను మనవి చేస్తున్నాను ఇదివరకే మెట్టభూములలో సర్చార్జి అని రూపాయికి రెండు అణాలుచొప్పున వసూలుచేస్తున్నారు ఈ విధంగా అదనంగా అనేక పన్నులు వేయదలచుకొంటే రైతులు చాలా బాధ పడతారని, అవస్థ పడతారని మనవిచేస్తున్నాను యావ రేజి యీల్డ్ చూచినట్లయితే ప్రాంతం ప్రాంతానికి తేడాలు ఉన్నట్లు అర్థం అవుతుంది ఒకచోట రెండువేల పౌనుల యావరేజి యీల్డ్ ఉండి, మరొకచోట 8 వందలు ఉంటే, యీ రెండింటికీ ఒకేవిధమయిన టాక్సు విధించినట్టయితే, రెండువేల పౌనులు యీల్డు ఉన్నచోట గిట్టుబాటు అవుతుంది 8 వందల పౌనులు యీల్డు ఉన్నచోట గిట్టుబాటు ఉండదు కాబట్టి, యీ విష యాలన్నీ ప్రభుత్వం దీర్ఘంగా ఆలోచించి పన్నులు వేయవలసిందిగా కోరు తున్నాను

*శ్రీ పి. శ్రీరాములు (దుగ్గిరాల) అధ్యక్షా, ప్రస్తుతం రెవిన్యూమంత్రి గారు తీసుకువచ్చిన వాణిజ్య పంటలపయిన విధించేపన్ను బిల్లుగురించి, వాస్తవ పరిస్థితులదృష్ట్యా కొన్ని సూచనలు చేయదలచుకొన్నాను నిజానికి రైతు పండించే భూములలో చాలా వ్యత్యాసాలు ఉన్నాయి ఆహార పదార్థాలు పండించే భూముల్లో, వాణిజ్య పంటలు పండించే భూముల్లో, తోట భూముల్లో అనేకరకాల తరతమ భేదాలు ఉన్నాయి ఈ తరతమ భేదాలనుబట్టి, ఆభూముల వల్ల వచ్చేటటువంటి ఆదాయాన్నిబట్టి, వాటికయ్యే ఖర్చునుబట్టి, అక్కడ ఉన్నటువంటి అనుభవాన్నిబట్టి, రైతులు ప్రభుత్వానికి పన్నులు ఆయా తేడాల వారీగా చెల్లించటం న్యాయం మనసమాజం ప్రోగ్రెసివ్‌గా ఉండాలంటే, అన్ని విధాలా అన్నిరంగాల్లో మన గ్రామాలు ముందుకుపోవాలంటే, ప్రభుత్వానికి అవసరమయిన ధనసేకరణలో ప్రతి ఒక్కరు సహాయము, సహకారము చేయ వలసిన అవసరము ఉన్నది కాని, ఒక విషయము ప్రభుత్వదృష్టికి తనుద్వారా తీసుకురాదలచాను వాణిజ్య పంటలు అంటే, ఇప్పుడున్నవన్నీ వాణిజ్యపంటలే. ఇప్పుడు యీ బిల్లులో సూచించబడినవిధంగా, తోటలు ఉన్నాయి, నిమ్మ, నారింజ, బత్తాయి, అరటి, పంచదార, చెఱకు— ఇవన్నీ యీబిల్లులోఉన్నాయి అంటుమామిడి యీ బిల్లులో లేదు. ఆర్థికమంత్రిగారు, రెవిన్యూమంత్రిగారు, తాము సూచించిన విషయాలుకాక, సభ్యులు యింకా కొత్తపన్నులు ఏవైనా సూచిస్తే సంతోషిస్తామన్నారు వారు సంతోషించే విధంగా నేను ఒకసూచన

చేస్తున్నాను ఈబిల్లులో నమోదు చేయబడకుండ ఉన్నటువంటి, ప్రతిసంవత్సరం నికరంగా ఆదాయం రాగలిగినటువంటి అంటుమామిడి తోటలను యీ బిల్లు నుండి మినహాయించడం అనవసరము అంటుమామిడి తోటలమీద కొంతపన్ను వేస్తే రైతులకు నష్టం ఉండదని నేను భావిస్తున్నాను

అయితే నిమ్మ, నారింజ, బత్తాయి, అంటుమామిడి, పంచదార, చెరుకు వీటిఅన్నింటి విషయములో కూడ fruit bearing stage కి వచ్చినప్పటినుంచి ప్రభుత్వం పన్ను విధించడము న్యాయము అని నా అభిప్రాయము ఎందువల్లనంటే, అంతవరకు వీటిమీద రైతుకు ఏ విధముగాను ఆదాయము ఉండదు. నష్టములోనే ఉంటూ చెట్లను పెంచుకుంటూ ఉంటాడు ఫలసాయము వచ్చిన తరువాతనైనా ప్రతి సంవత్సరము కూడ వీటికి ఒకేరకమైన ధర లేకపోయినప్పటికినీ, ఒకేరకమైన నికరాదాయము, నికరధర ఉండటానికి అవకాశములు నా అనుభవమును బట్టిచూస్తే, ఉంటూఉన్నవి వాటికి నిజముగ యిప్పుడు యీ బిల్లులో సూచించిన ప్రకారము కాకుండా యింకను అదనముగానే ఎకరము ఒకటింటికి రెండు, మూడు రూపాయలు శిస్తు విధించినప్పటికినీ కూడా రైతు ఎక్కువగా బాధపడడేమోనని నేను వ్యక్తిగతముగ భావిస్తున్నాను. ఉదహారణకు నిమ్మతోటలు తీసుకోండి అదేవిధముగ బత్తాయి తోటలు ఉన్నవి వీటిలో ఒక్కొక్క ఎకరానికి కొన్ని వందల రూపాయిలు, సుమారు వెయ్యి రూపాయలవరకూ వచ్చే తోటలు ఉన్నవి లేవని నేను చెప్పడములేదు ఇది వాస్తవమైన విషయమే కాని వాటికి ఒక విధమైన నిలకడ నికరాదాయము వస్తుందనేటటువంటి ఆశ అందరికి ఉండడము అనేది నా అనుభవములో నేను చూస్తూనే ఉన్నాను అలాంటివాటికి శిస్తు విధించడము న్యాయమే ఆయా భూములలో ఆయా తోటలు వేసినవారు అందరు, యిది వాస్తవముకాదు అని అనరు ప్రభుత్వానికి తప్పకుండ యీ విషయములో తోడ్పడుతారు. అయితే ఉదాహారణకు యిప్పుడు చెఱకు అని ఉన్నది అనుకోండి పంచదార చెఱకుకు, బెల్లముచెఱకుకు ఒకేరకమైన నిర్వచనము యివ్వడము చాలా అన్యాయము. బెల్లము తయారుచేసే చెఱకుకు పంచదార చెఱుకుకు ధర తేడా ఉన్నది. బెల్లము తయారు చేసే చెఱకు విషయములో యీ సంవత్సరం బెల్లము పుట్టి నూరు రూపాయలు ఉంటే, మరొక సంవత్సరం 80 రూపాయలు, 25 రూపాయలు 40 రూపాయలు ఈ విధముగ హెచ్చుతగ్గు ధరలు ఉంటూఉంటుంది. ఏ సం. లోను దీనివల్ల యింత నికరాదాయము వస్తుందన్న ధైర్యము, నమ్మకము ఉండదు. ఇది ప్రభుత్వము కాదుకదా, వ్యాపారస్థులు కాని, రైతులు కాని, అనుకోటానికి అవకాశములు లేకుండా వున్నవి పంచదార చెఱకుకు అట్లా

కాదు దానికి నీర్ణీతధర ఏర్పాటు చేశారు ఇలాంటి సందర్భములో యీ తేడా వున్నదని ఆలోచించకుండా, రెండింటికి "చెఱకు'' అని నిర్వచనము యిచ్చి దానికి దీనికి సమానమైన పన్ను విధించడము సబబు కాదు అని నేను పన్నుల మంత్రిగారికి, రెవిన్యూ మంత్రిగారికి, ఉభయులకుకూడ మనవి చేస్తున్నాను ఇక పసుపు విషయము ఉన్నది పచ్చి పసుపు కాని, ఎండు పసుపుకాని చేతిలో వేసుకుని నలిపితే పచ్చగా ఉంటుంది ఈ పసుపురంగును చూచి పసుపు పండించే రైతులందరు ఎల్లప్పుడు పచ్చగానే ఉంటూంటారని యీ మంత్రులు యిద్దరికీ ఒక విధమైన అభిప్రాయము ఉన్నట్లుగా ఉన్నది నాకు ఒక్క విషయములో మాత్రము వారికి యీలాంటి అభిప్రాయము ఉన్నట్లు అర్థమైంది పన్నుల శాఖామాత్యులైన గోపాల రెడ్డిగారు——

శ్రీ కె వెంకటరావు ఆయన పన్నులశాఖ మంత్రికారు

శ్రీ పి శ్రీరాములు ఆయనకు Commercial tax శాఖ ఉన్నది కనుక, ఆ విధంగ అంటున్నాను ఇలాంటి రెండు హోదాలతోను ఆయన యిదివరకు తెనాలి మకాముకు వచ్చినప్పుడు గత నాలుగు సం॥లుగా పసుపుకుధర తగ్గడమువల్ల వాళ్ల కష్టములు యీ విధముగ ఉన్నవని వారితో మనవి చేశాను వారు ఎకరానికి యింత పెట్టుబడి పెడుతున్నారు, పంట యింత వస్తున్నది, కాని ధరమాత్రము లేదు, ఖర్చులుకూడ గిట్టడములేదు, కాబట్టి Sales tax విధించడముగాని, లేక పోతే అదనపు పన్ను విధించడముగాని, యీ పసుపుకు ధర స్థిరీకరణ చేసేటంత వరకు ఆపండి, అని మొరపెట్టుకుంటే గూడ లాభంలేకపోయింది. వారికి మన స్సుకు కష్టము లేకుండాఉంటే, నేను సున్నితమైన విషయము చెబుతాను——ఈ పన్నుల విధింపునుగురించి, రైతుల కష్టములు అన్నీచెప్పి, పన్నులు వేయవద్దు, పెంచవద్దు అని కోరుతూ చెప్పేటప్పుడు, చక్కగా, సావధానముగ వింటారు గాని ఏమి ప్రయోజనము ? సిమెంటు రాయితోకట్టిన గోడకు చెప్పినా ఒకటే, ఆయనతో చెప్పినా ఒకటే నన్నట్లు నా మనస్సుకు తోచింది ఇప్పుడు యీ విధ ముగ వారిని అన్నానని వారు మనస్సున నొచ్చుకోరు అని నేను భావిస్తున్నాను ఈ పసుపునుగురించి మరొక విషయము మనవి చేస్తున్నాను పసుపు తోటల మీద ప్రభుత్వము పన్నులు విధిస్తున్నారంటే ప్రతి సం॥ము కూడ ఒక్కొక్క ఎకరమునకు పెట్టుబడి పెట్టటానికి అవసరము లేనటువంటి తోటలకు. ప్రతి సం॥ కూడ విధిగా పెట్టుబడిపెట్టి, అది ఎరువులకు అనండి, విత్తనములకు అనండి లేక యితర seasonal గా చేయవలసిన అవసరములకు అనండి, దేనికైనాగాని సుమారు 4,5 వందల రూపాయలదాకా పెట్టుబడి పెట్టితేకాని, ఆ ఎకరములో ఏ అయిదారు పుట్లోగాని పసుపు పండదు. ఇంత ఖర్చుచేస్తే గూడ అది

రాష్ట్టుకోటానికి అయినా పసుపుకు ధర ఉండాలిగదా అది లేకపోతే రైతు నష్టపడక మరేమిటి ? సాధారణమైన పసుపుకు ధర 60 రూపాయలకంటె ఎక్కువలేదు ఒక్కొక్క ఎకరానికి 400 రూ లు లోపల ఆదాయము వస్తూంటే, 600 రూ లు పెట్టుబడిపెట్టి ప్రయోజనము కన్పించడము లేదు పోనీ ఏ ఒక్క సం॥మో యీ విధముగ ఖర్చు చేయవలసివస్తుంది గనుక, నష్టమువచ్చినా పరవాలేదు అనుకోటానికి వీలులేదు ఈ పెట్టుబడి ప్రతి సంవత్సరము ఖర్చు చేయవలసిందే ఏదో seasonal గా యిది యీ ఒక్క సంవత్సరములో మాత్రమే జరిగింది అని అనుకోటానికి వీలులేదు అయినను యీ సంవత్సరములో జరిగినదానికి ఏమిచేయగలము అని రైతులు ఆలోచిస్తూంటే, ప్రభుత్వము అది నిర్ణీతనుగ తీసుకుని, దానిమీదకూడ అదనపు పన్ను వేయటానికి వీలులేదని మేముకోరితే, అది వీలు కాదు, పన్ను కట్టవలసిందే అని ప్రభుత్వం చెప్పవచ్చు ఇలా నష్టము రావడము యీ ఒక్క సంవత్సరమే కాదు ఇప్పటికి నాలుగు సంవత్సరాలుగా యీ విధముగ ధర పడిపోయింది ఈ నాలుగు సంవత్సరములనుంచి రైతులు నష్టపడుతూనే ఉన్నారు

ఆర్థికమంత్రి (డాక్టరు బి గోపాలరెడ్డి) Highest price ఏ సంవత్సరములో ఉన్నదో, lowest price ఏ సంవత్సరములో ఉన్నదో ఆ వివరాలు చెప్పండి

శ్రీ పి. శ్రీరాములు ఇదిచాలా fluctuating గా ఉండే ధర ఒక్కొక్క సంవత్సరంలో యీ ధర 25 రూపాయలు ఉన్నది ఒక్కొక్కప్పుడు 350 రూపాయలవరకు ఉండేది దీనికి నేను ఒప్పుకుంటాను

డాక్టరు బి. గోపాలరెడ్డి అలాగైతే 350 రూపాయలు ధర ఉన్నప్పుడయినా అదనపు పన్ను కట్టవచ్చునుకదా !

శ్రీ పి. శ్రీరాములు ధర ఎక్కువగా ఉన్నప్పుడు తప్పకుండా కట్టవచ్చు. అందుకు ఎవరూ అభ్యంతరము పెట్టరు. అందువల్లనే పసుపువిషయంలో పన్ను పెంచవద్దని కోరేది పన్నులు బొత్తుగా వేయవద్దని నేను చెప్పడం లేదు. నేను చెప్పేది మంత్రిగారు పూర్తిగా వినమని అంటున్నాను. దీనికి ధర నిర్ణయము చేసిగాని, లేకపోతే గిట్టుబాటు ధర ఉన్నప్పుడే, యీ అదనపు పన్ను ఎకరానికి నాలుగు రూపాయలు, అయిదు రూపాయలు వేసినను రైతులు అంతగా బాధపడరు అని నా వాదన. బొత్తుగా ధరలేకుండా పోయినపుడు అదనపు పన్ను వద్దని అంటున్నాను. ఒకవైపున పసుపుకు ధరలేక నష్టపడే పరిస్థితిలో ఉంటున్నప్పుడు, యింకొకవైపున అదనపు పన్ను వేయడము న్యాయం

కాదు కాబట్టి నేను కోరేది ముఖ్యంగా ధర స్థిరీకరణ చేయండి, లేకపోతే రైతులకు కావలసిన ఎరువులు controlled rates కు అయినా సప్లయిచేయండి, అంతేకాని, ఏదీలేకుండా పన్ను పెంచడము న్యాయము కాదు అయితే యీబిల్లులోఒక అవకాశము ఉన్నది Seasonal గా ఏ సంవత్సరములోనయినా crop fail అయినప్పుడు, దానికి remission యివ్వటానికిగాని, ధర పడిపోయి నప్పుడు పన్ను తగ్గించటానికిగాని, remission యివ్వటానికి అధికారము ప్రభుత్వము తీసుకుంటున్నది అయినప్పటికినీ, ప్రస్తుత పరిస్థితులలో పసుపుకు ధర స్థిరీకరణ జరిగేటంతవరకు, యీ అదనపు పన్ను వెయడము న్యాయముకాదు అంతవరకు దీనిని ఆపండి పుట్టికి రెండువందలు దర వచ్చేవరకు, రైతులమీద పన్ను వేయకూడదు, వేస్తే వాళ్ళను బాధపెట్టినట్లే అవుతుంది నిమ్మ, నారింజ, బత్తాయి, అరటి విషయములో మొక్క నాటినప్పటినుంచి ఫలసాయం ఉండదు ఫలసాయమునకు వచ్చినప్పటినుంచే ఆదాయము వస్తుందిగనుక, అప్పటినుంచి పన్ను వేయడము ప్రారంభించవచ్చును అంతవరకు వేయకూడదు. ఈ విధానమున కనుగుణముగ బిల్లును వర్తింప జేయాలని నాయొక్క ముఖ్యమయిన సూచన దీనిని మంత్రిగారు అంగీకరించమని కోరుతున్నాను

ఇకపోతే nursery ల విషయము ఉన్నది. Nursery లలో తోటలకు పనికివచ్చేదాకా మొక్కలు పెంచడము, వాటిని తరువాత తోటలకు సప్లయి చేయడము ఉంటుంది దీనికి కాలనిర్ణయము బిల్లులో కన్పించడము లేదు విత్తనములు చల్లినప్పటినుంచి మూడు సంవత్సరములు, నాలుగు సంవత్సరములు nursery లలో వుంచి, అటుతరువాత తోటలలో మొక్కలను నాటవలసి యున్నది ఆమొక్కలు మరల ఫలసాయమునకు వచ్చేటప్పటికి ఏ మూడు నాలుగు సంవత్సరములో పట్టుతుంది అంతవరకు రైతుకు ఫలసాయము ఉండదుగనుక ఫలసాయము రావడము ఆరంభించినప్పటినుంచే పన్ను విధించడము న్యాయము

తరువాత పండ్లతోటల విషయము— ఆరోగ్యముకొరకు ప్రజలు పండ్లరసము త్రాగడము ఉంటున్నది. పండ్లు అని నిర్వచనము యిచ్చినప్పుడు చింతపండుకూడ పండు క్రింద కే వస్తుందని దానికి కూడ టాక్సు వేయవచ్చు, ఇతర పండ్లరసము మాదిరి చింతపండు కూడ దినమూ కూడా నాలుగు గ్లాసులు రసము చేసుకొని త్రాగరు. ఆరోగ్యము చెడుతుందిగదా అందువల్ల పండ్లు అన్నింటికి ఒకే నిర్వచనము యివ్వకుండ పేర్లు నిర్ణయించడము ఆవశ్యకము, ఇదిగాక యీ తోటలు ఏ ఇరవై, ముప్పై సంవత్సరాలనుంచో ఫలసాయము వచ్చే తోటలను, తోట అనే నిర్వచనము తీసుకోవలసి వుంటుంది. కాని

annual గా crop ఉండి, మరు సంవత్సరము అది పోయే తోటలుకూడ యీ నిర్వచనము క్రిందకు తీసుకుని రావడము న్యాయముకాదు కాబట్టి annual గా crop వచ్చే తోటలను మినహాయించాలని అంటున్నాను ఉదాహరణకు మిరప తోట ఉన్నది ప్రతి సంవత్సరముకూడ మిరపతోటలకు తెగుళ్ళు సంభవించడం కద్దు ఏసంవత్సరములోనుకూడా తెగుళ్లు రాకుండా, పంట నాశనము కాకుండా ఉండడము లేదు దీనికి ధర ఎప్పుడో, ఏ రెండు సంవత్సరములకో, పది సంవత్సరములకో అధికముగ వుంటుంది అంతమాత్రముచేత దీనినివాణిజ్య తోట అనే నిర్వచనముక్రిందకు తేవడము న్యాయము కాదు ప్రత్యేకంగా యిది ఆహార పదార్థములకు సంబంధించింది పేదవాళ్ళుకూడ మిరపకాయలు కారము తయారు చేసుకుని ప్రతినిత్యము వాడుకునే వస్తువ ప్రస్తుతము షాపులో కారము తక్కువగ ఉన్నదిగనుక మనకు అవసరమైన మిరపతోటలు యీ బిల్లు నుంచి మంత్రిగారు దయచూపిస్తూ, మినహాయింపు చేయాలని కోరుతూ విర మిస్తున్నాను

**श्री माधवराव** (जुक्कल) जनाबे सदर। तीन चार रोज से हम इस हाउस में टेक्सेस से मुताल्लेक बहस कर रहे हैं। यह जुमला टेक्सेस हमारे जरई काश्तकारों ही से मुताल्लेक हैं। इस से यह साफ जाहेर हो रहा है कि आन्ध्र प्रदेश गवनमेंट की नज़र में आन्ध्र प्रदेश का काश्तकार बहुत दौलतमन्द और सर्मायादार साबित हो रहा है। मैं खासकर रेवेन्यू मिनिस्टर साहब की तवज्जेह इस बात पर दिलाना चाहता हू कि वह सजीदगी के साथ ओर सही मानो मे इस पर ग़ौर फ़रमाएँ। आप देहात में जाएँ और काश्तकारों की हालत देखें। आप को मालूम होगा कि एक काश्तकार रात दिन खून-पसीना एक करके अपने बीवी बच्चे के साथ मेहनत करता है, फिर भी उसको ज़िन्दगी गुज़ारने के लिए पूरा मावेज़ा नहीं मिलता। वह अपनी जरूरियात पूरा करने के लिए बिल्कुल मोहताज रहता है। यहाँ तक कि उसको एक एक मर्तबा भूखा रहना पड़ता है, उसके जिस्म पर कपड़ा भी नहीं रहता। ऐसी हालत में भी हुकूमत उन काश्तकारों पर टेक्सेस आयद करके उन्हें मजबूर कर रही है तो मै समझता हूँ कि यह इन्साफ़ के खिलाफ़ मालूम होता है।

इसके बाद मै और भी चीज़ें गवर्नमेंट के इल्म में लाना चाहता हूँ। यह अमर मुसल्लेमा है और इसके रेवेन्यू मिनिस्टर साहब ने भी तसलीम फ़रमाया है कि तेलङ्गाना में तरी धाराजात सङ्गीन हैं। सिर्फ़ यही नहीं तेलङ्गाना के गैर बन्दोबस्तशुदा एरियाज़ जो सर्फ़ेख़ास और पायगाहों से सम्बन्ध रखते हैं वहाँ तो धाराजात और भी सङ्गीन हैं। यह मुसल्लेमा अमर है। इसके बाद मै इस जानिब तवज्जोह दिलाना चाहता हूँ कि हमारे निज़ामसागर एरिया में रहनुमाए जमाबन्दी के तहत धाराजात आयद हैं। उसके तहत अब्साली गन्ने की पैदावार पर जो १६ महीने की होती है, उस पर दो आबी और एक तावी धारा आयद किया जाता है। और यकसाला पैदावार जो कुल बारह महीने की होती है, उस पर दो आबी और

एक ताबी धारा आयद किया जाता है। और अड़साली गन्ने का मजमूई हैसियत ४९ रुपये से ७० रुपये तक होती है। इसी तरह एकसाला गन्ने की मजमूई हैसियत ३५ रुपये से लेकर ४९ रुपये तक होती है। इस मे एक चीज ग़ौर तलब है कि गवर्नमेंट की जानिब से जो अहकामात जारी होते हैं वह किस कदर नाइन्साफी पर मबनी हैं। अडसाली गन्ने को दो आबी और एक ताबी का पानी सेराब करती है लेकिन इस पर एक आबी का धारा नाजायज और ग़ैर मुनसेफाना तौर पर आयद किया जाता है। इस लेहाज़ से आप ग़ौर करें तो मालूम होगा कि यह धाराजात पहले ही से सङ्गीन हैं। इस पर मजीद नाइन्साफी यह कि अब इन्हे Commercial Crops कह कर इन पर मजीद धारा आयद किया जा रहा है। यह किस कदर इन्साफ़ की बात है ? मै कहूंगा कि काश्तकारो के दिल पर जो जख़्म पहले से है, उन पर और नमक छिडका जा रहा है। आप मेरी आवाज़ न मानें न सही। लेकिन ईश्वर ने न्याय और नीति का जो रास्ता बताया है मै उसको बतला रहा हूँ। आप के हाथ मे अधिकार है, इस लिए जो चाहे करें ऐसा न होना चाहिए। आप अच्छे रहो और हम को भी अच्छा रखो। चूँ कि यह नैशकर पर भी टेक्स से मुतालेक़ मसला है, इस लिए मै यह भी कहूगा कि निजाम शुगर फ्याक्टरी बीस साल से चल रही है। इसका मुनाफा लाखो रुपये हैं। इसके अलावा शुगरकेन सेस भी है। नही मालूम इसका इस्तेमाल किस तरह किया जा रहा है। आप वहाँ इंटीरियर एरिया मे जा कर देखिये वहाँ गन्ना खीचने की सड़क ठीक नही हैं। बैल जो गन्ना खींच कर लाते हैं उनके पानी पीने के लिए कोई इन्तेजाम नही है। इस पर भी रिआया पर इस तरह का बार डाला जा रहा है। यह बिल्कुल इन्साफ के ख़िलाफ़ है। कल हमारे एक एम एल ए श्री श्रीनिवास राव ने आनरेबल चीफ़ मिनिस्टर साहब की तवज्जोह बोनस के सिलसिले में मबजूल करवाई थी। इस पर चीफ़ मिनिस्टर साहब ने फ़रमाया कि यह मसला फ्याक्टरी के मेनेजमेंट का है। हमारे हाथ मे कुछ नहीं है। हम उन्हें यूँ ही सरसरी तौर पर तवज्जोह दिलायेंगे। बोनस देना नही देना उनकी मर्ज़ी पर मुनहसिर है। मैने बजट पर बहस के समय इन्डस्ट्रीज़ डिमाड पर भाषण देते हुए कहा था कि इस फ्याक्ट्री को नेशनलाईज करना चाहिये। इसका जवाब देते हुए चीफ मिनिस्टर साहब ने फ़रमाया था कि हम इसको दो तीन साल के अन्दर नेशनलाईज़ करने वाले हैं। इसकी एक मुद्दत है। इस बारे में बाबू ख़ाँ से बात चीत भी की गई है। बिला वजेह उनके मोआहेदे में क्यों फ़र्क किया जाये। एक दो एडमिनिस्ट्रेटर्स मुकर्रर कर लें तो इन्तेज़ाम ठीक हो सकता है। इसके आलावा सेप्टेम्बर की १८ तारीख़ को नैशकर के काश्तकारों का एक वफ़्द जिस में उस जिले के पूरे M L As. भी शरीक थे आली जनाब चीफ़ मिनिस्टर साहब की ख़िदमत में पेश हो कर बोनस के मुताल्लेक़ अर्ज किया था तो उन्होंने फ़रमाया कि इस मे शक नहीं कि फ्याक्ट्री में सरकार के ज़्यादा शेर्स हैं। इस में नफ़ा नुक़्सान सरकार ही का ज़्यादा है। बाबू ख़ाँ को कोई दख़ल नहीं है। नफ़ा होगा तो सरकार का, नुक़्सान होगा तो सरकार का। जब ऐसी बात है तो काश्तकारों के हक़ में जो भी बोनस निकलता है, सेक्रेट्रियट से हिसाबात तलब करके बोनस दिलाना चाहिये। लेकिन चीफ़ मिनिस्टर साहब का कल का जवाब समझ में नहीं

आया कि आनरेबल चीफ मिनिस्टर साहब नेशकर के काश्तकारों से क्यों इस कदर दूर हो रहे हैं। उनके हकीकी मेहनत का सिला उनको क्यों नहीं दिला रहे है?

*SRI K VENKATA RAO* The hon Member is speaking about something which the hon Chief Minister said in reply to a question It is about distribution of bonus or some such thing at Bodhan Sugar Factory It has very little relevance with the Bill

**श्री माधवराव** वह सही है। मै इसको खतम कर रहा हूँ। मैने इस पर तवज्जोह दिलाई है।

**श्री कला व्यंटराव** आप किसी दूसरे अवसर पर यह बहेस कीजिये।

**श्री माधव राव** गुजिश्ता हैद्राबाद गवर्नमेंट के इडस्ट्रीज मिनिस्टर श्री व्ही के. कोरटकर ने छ आने तीन पाई के हिसाब से बोनस दिलाया था। चूंकि यह मसला नेशकर से भी सम्बन्ध रखता है इस लिये मै इसपर तवज्जोह दिला रहा हू और आनरेबुल चीफ मिनिस्टर साहब से पुरजोर अपील करूँगा कि वह इस पर मुकरर गौर करें और काश्तकारो को उनकी मेहनत का हकीकी मावेज़ा दिलायें।

इसके बाद मै असली मसले पर आऊगा। नेशकर के बारे में मैने बताया कि इसपर महसूल पहले ही नाजिसाफ़ी पर मब्नी है। इसपर तेलगाना एरिया पर यह मजीद टेक्स आयद करना तेलगाना एरिया के लिये नामुनासिब है। यह मसला किसी हाल सेलेक्ट कमेटी के सामने जायेगा। मै आशा करता हूं कि इसपर पूरा विचार किया जायेगा। तेलगाना के निजामाबाद, आदिलाबाद, और नलगुंडा के खुशकी जमीनात की हालत बहुत खराब है। अक्सर पहाडी और चलका जमीनात हैं। उन के बारे भी मामूली हैं। लेकिन अब खुश्की आराजियत पर अब मिर्च मूगफली और कपास का बारा आयद किया जारहा है। हालत तो यह है कि उन के असली अखराजात भी बरामद नहीं होते। लेहाज़ा इन टेक्सेस से उन को सुबुकदोश करना चाहिये।

इसके बाद मै कानून की दफ़ा तीन के एक्सप्लेनेशन (2) के संबन्ध में कहूंगा कि यह बजेह नहीं है। किसी एरिया पर अलाहेदा अलाहेदा काश्त की जाये तो उसपर टेक्स आयद नही होना चाहिये। मुझे आशा है कि इसकी सराहत होनी चाहिये। मैं रेवेन्यू मिनिस्टर साहब से आशा करता हू कि वह काश्तकारों की मुशकिलात को सामने रखेंगे और उन के हक़ में इन्साफ़ करेंगे। मुझे आशा है कि सेलेक्ट कमेटी में इस मसले पर संजीदगी से और बखूबी गौर करके खासकर नेशकर के काश्कारों और दीगर काश्तकारों के साथ इन्साफ़ होगा।

यह तवक्को करते हुए मैं अपने ख्यालात को खतम करता हूँ।

*శ్రీ పి. వి. సూర్యనారాయణరాజు (ఎలమంచిలి): అధ్యక్షా, ఈ బిల్లుపై మాట్లాడే అవకాశం ఈరోజు నాకు కల్పించినందుకు మీకు నా ధన్యవాదములు

అర్పిస్తున్నాను మనము గత సంవత్సరంలో రెండు మూడు టాక్సులు వేశాము ఈ సంవత్సరములో నిన్న, మొన్న రెండు టాక్సులు వేశాము ఇవాళ మూడవ టాక్సు వేస్తున్నాము కమ్మర్షియల్ క్రాప్స్ అని మొత్తం 10 ఐటమ్స్‌మీద ఈ టాక్సు వేస్తున్నారు చెఱకు, అరటి, పసుపుమీద వేస్తున్నారు ఇంతవరకు చెఱకుమీద కేన్ సెస్ అని టన్నుకు 5 రు చొప్పున ఫ్యాక్టరివారిద్వారా రైతులనుండి వసూలు చేస్తున్నారు దీని విషయమై గౌరవ సభ్యులు మాట్లాడినపుడు శ్రీ గోపాలరెడ్డిగారు "ఇది రైతులనుండి వసూలు చేయడం లేదని, ఫ్యాక్టరి వారినుండే వసూలు చేస్తున్నాము" అని చెప్పారు ఫ్యాక్టరివారు indirect గా రైతులనుండి ఆ డబ్బు తీసుకొని గవర్నమెంటు వారికి చెల్లిస్తున్నారు కోఆపరేటివ్ బేసిస్‌మీద షుగర్ ఫ్యాక్టరి పెట్టకోమని చెప్పారు మేము షుగర్ ఫ్యాక్టరి పెట్టుకోటానికి సిద్ధంగా వున్నప్పుడు, టన్నుకు 5 రు లు వేసి రాష్ట్రం మొత్తంమీద 60, 70 లక్షలు కేన్ సెస్‌గా ఈ ప్రభుత్వమువారు తీసికొంటున్నారు ఆ డబ్బును ప్రభుత్వం వసూలుచేస్తూ దానిలో 50% కేన్ డెవలప్‌మెంటుకు, 50% షుగర్ ఫ్యాక్టరి ఏరియా డెవలప్‌మెంటుకు వినియోగిస్తామని చెప్పారు కాని అలా జరగటంలేదు నిరుడు సంవత్సరం టన్నుకు 3 రు వసూలు చేశారు ఈ సంవత్సరము టన్నుకు 5 రు వసూలు చేశారు. ఇది కాకుండా లోకల్ బోర్డ్సువారు చెఱుకు గానుగతో బెల్లం తయారుచేస్తే గానుగకు 15 రు, 20 రు వసూలు చేస్తున్నారు మామూలుగా ఈ షుగర్ కేన్‌కు 1st Crop అని 6-4-0 వసూలు చేస్తున్నారు మళ్ళీ ఫసలి tax అని 3-2 0 వసూలు చేస్తున్నారు మొత్తంమీద షుగర్ కేన్‌కు గాని, అరటికి గాని లెక్కచూస్తే 15 రు వరకు చెల్లించవలసి వస్తున్నది ఆంధ్రదేశంలో 1,70,000 ఎకరాలు వుంటే దాదాపు 1,40,000 ఎకరాలు చిన్నరైతులు వున్నారు ఒక ఎకరము, 50 సెంట్లు గలవారే ఎక్కువమంది వున్నారు పెద్దరైతులు ఎక్కువమంది లేరు. కోఆపరేటివ్ బేసిస్ మీద షుగర్ ఫ్యాక్టరి పెట్టాలని మేము అనుకొన్నప్పటికి యీ పన్నులవల్ల పెట్టటమా, విరమించుకోవటమా అని ఆలోచించవలసియుంది ఒక industry ని start చేయమని చెప్పి ఆ industry మీద revenue క్రింద పన్ను వేయడం న్యాయంకాదని మనవి చేస్తున్నాను. Grow more food క్రింద అరటినికూడా food crop క్రింద treat చేశారు అలా treat చేసి Commercial tax అని మళ్ళీ పన్ను వేస్తున్నారు మంత్రిగారు ఒక ఉపన్యాసంలో పసుపు ఎక్కువగా వాడాలి, face powders ను మానండి అని చెప్పారు .

శ్రీ కె. వెంకటరావు - స్త్రీలంతా ఎక్కువగా పసుపు వాడటం ప్రారంభిస్తే ఖరీదు ఎక్కువై మీకు పన్ను ఎక్కువ వస్తుంది.

శ్రీ సి. వి సూర్యనారాయణరాజు 1955-1956లో 500 పౌన్లు గల పుట్టి 280 మొదలు 380 వరకు అమ్మేది కాని ఈరోజు రు 50 లకు ధరకు దిగిపోయింది మిగిలిన పంటలవలెనే పసుపుకూడా సామాన్యమైన పంట కాదు దానికి గాలి, వర్షం, శీతోష్ణస్థితి కుదిరితేగాని బాగా పండదు, సరైనధర రాదు Mixed crops వేసినపుడు ఏ క్రాపుకు ఎక్కువ వస్తుందో, ఆ క్రాపుకు పన్ను వేస్తామని మంత్రిగారు ఈ బిల్లులో సెలవిచ్చారు బుడమచేను వేసినపుడు ఆ చేనులో అక్కడక్కడ ప త్తిమొక్కలు వేస్తూఉంటారు పట్టా మొత్తంమీద పన్ను వసూలుచేస్తామని అంటారు బుడమచేనులో ప త్తి ఎకరానికి ఒక బస్తా, రెండు బస్తాలకంటె ఎక్కువ అవదు కనుక పట్టా మొత్తంమీద వసూలు చేయటం న్యాయంకాదని మనవిచేస్తున్నాను లాండు రెవిన్యూ మోస్తరుగా Rent Recovery Act క్రింద వసూలు చేస్తామని చెబుతున్నారు పట్టాదారులలో జాయింటు పట్టాలోని వారైనా, పెద్దవాడిదగ్గర వసూలు చేయవచ్చుని Rent Recovery Act చెబుతోంది అలా పట్టాదారులలో పెద్దవాడిదగ్గర వసూలుచేస్తే దానిని తిరిగి క్రిందవారిమీద దావావేసి తెచ్చుకోవలసిన బాధ్యత పెద్దవాడిపై వుంటుందేమోనని మనవిచేస్తున్నాను ఇచ్చట ఎవరు సేదిపండిస్తే వారివద్ద వసూలుచేయాలి కాని Rent Recovery Act క్రింద ఒక మనిషినుండి వసూలు చేయటం న్యాయంకాదని మనవిచేస్తున్నాను చుట్టూ గట్లమీద వేసిన మొక్కలకు మేము వసూలు చేయమేమో అని వెంకట్రావుగారు ఇందాక వారి ఉపన్యాసములో చెప్పారు దానివల్ల ఒక అనుమానం నాకు కల్గింది Grow more food క్రింద ప్రతిరైతు కూడా పట్టాచుట్టు 100, 140 వరకు కొబ్బరిమొక్కలు వేసుకొన్నాడు విలేజి ఆఫీసర్లు గట్లుకొలచి 10 సెంట్లు దాటింది 140 మొక్కలు వున్నాయి కనుక డబ్బు ఇవ్వమని అడుగుతారేమోనని అనుమానంగా వుంది దానిని clarify చేయవలసిన అవసరం వుందని. ఆ విషయాన్ని సెలక్టుకమిటీలో ఆలోచించాలని కోరుతున్నాను.

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ (పాతపట్నం-జనరల్) : అధ్యక్షా! రెవిన్యూ మంత్రిగారు తీసుకువచ్చిన ఈ బిల్లును నేను బలపరుస్తూ కొన్ని సూచనలు చేయదలచుకొన్నాను ఈ మనీక్రాప్స్ విషయములో ఈ పన్నులు అంత భారము కాకపోయినా రైతులు పడుతున్న బాధలు ప్రభుత్వము గమనించాలని కోరుతున్నాను. ఈ పన్నులవల్ల 50 లక్షలు వస్తున్నాయని మంత్రిగారు చెప్పారు అవసరము వస్తే కోటిరూపాయలకు కూడా తీసుకువచ్చే అవకాశాలు వున్నాయి. కాని ప్రభుత్వం చేయవలసిన కర్తవ్యం ఒకటి వుంది. ఈనాడు జనుము, చిల్లిస్ ధరలు పూర్తిగా పడిపోతున్నాయి. వాటిని కొంతమంది

వ్యాపారస్థులు కంట్రోల్ చేస్తున్నారు 5, 6 మాసాల తరువాత వాటికి విపరీతమైన ధరలు వస్తున్నాయి అంతవరకు తమవద్ద వుంచుకొనే అవకాశము, ఆధారము రైతుకు లేదు కోట్లరూపాయలు విలువచేసే జూట్ మా జిల్లాలో పండుతుంది ఈనాడు మార్కెటులో మంచి ధర ఉంటే ఎకరానికి 200 కాదు 300 అయినా చెల్లించటానికి సిద్ధంగా వున్నాము కలకత్తాలోని మార్వాడీలు జ్యూట్‌ను ఎక్కువగా కంట్రోల్ చేస్తున్నారు దానిమీద వచ్చిన **products** ధర అయినా తగ్గలేదు అసలు పంటధర మాత్రం తగ్గింది చిల్లిస్ ధర ఇతరదేశాలలో బ్రహ్మాండముగా వుంది మద్రాసు మార్కెట్టులోను ఆ ధర వుంది రైతులవద్ద కొనేటప్పుడు మాత్రం తక్కువ ధరకు కొంటున్నారు ఇటువంటి విషయాలపై ప్రభుత్వం చర్యతీసుకొంటే రైతు పన్ను చెల్లించుటకు ఎటువంటి అభ్యంతరము చెప్పడు ఎకరానికి 1-0-0 నుండి 3-0-0 వేసినా రైతు కట్టటానికి సిద్ధంగావున్నాడని మనవి చేస్తున్నాను మార్కెటులో వున్న ధర రైతుకు అందుబాటులో వుండేటట్లు చేయాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను క్రిందటి సంవత్సరాలలో మా జిల్లాలో కోట్ల రూపాయలు విలువగల జ్యూట్ పండినా, అది కలకత్తా వ్యాపారస్థుల చేతుల్లో వుండటంవల్ల, ధరలు తగ్గించకుండా వుండడంవల్ల జ్యూట్‌ను మార్కెటులోనికి తీసుకురావటానికి వీలులేకపోయింది ఆ విషయాన్ని ఢిల్లీలో శ్రీ టి టి కృష్ణమాచారి గారికి చెప్పాము 'ఈ జ్యూట్ పనికిరాదు అనకుండా పైదేశాలకు పంపించే అవకాశం కల్పించండి' అని మేము కోరగా తప్పకుండా అలా చేస్తామని మాకు హామి ఇవ్వటమే కాక పార్లమెంటులోకూడా చెప్పారు కాని తరువాత ఏ కారణంవల్లనో కాని 'పైదేశాలకు పంపించటానికి వీలులేదని, గవర్నమెంటువారు నిర్ణయించా'రని చెప్పారు దానివల్ల పంట పండించిన రైతులంతా సర్వనాశనమై పోతున్నారు పండించిన పంటను ఇంట్లో వుంచటానికి వీలు లేదు పెద్ద ధర వస్తుందేమోనని 6, 8 మాసాలు పంటను ఇంట్లో వుంచుకొనే అవకాశంలేని దుర్భరస్థితిలో రైతు ఈనాడున్నాడు మార్కెటింగ్ కమిటీలు, కోపరేటివ్ సొసైటీలద్వారా అప్పుగా తీసికోవటానికి అవకాశములులేవు వున్నా వాటిని వుంచటానికి స్థలములేదు. చిల్లిస్ కాని ఆనియన్స్ గాని హెచ్చుగా పండిస్తే ఇతరదేశాలకు **export** చేయటానికి అవకాశం కల్పిస్తామని ప్రభుత్వం అంటుంది కాని మార్చి, ఏప్రెల్ నెలలలో పంటలు పూర్తి అయితే ప్రభుత్వం **result** ను నవంబరు, డిశంబరు వరకు వెల్లడించదు అంతవరకు, ఈ 6 మాసాలు రైతులు పంట తమవద్ద వుంచుకోవటానికి అవకాశంలేక వారు చాలా దెబ్బతింటున్నారు. రైతులు పండించిన పంట వర్తకులు పూర్తిగా

దోపిడిచేసుకొంటున్నారని చెప్పటములో ఏమాత్రము అతిశయోక్తి లేదని నేను మనవిచేస్తున్నాను

ఈ పన్నుల విషయమై అనేక సూచనలు ప్రభుత్వానికి చేయబడినాయి పన్నుల వల్ల ఒక కోటి రూపాయలు మాత్రమే వసూలుచేయాలనికాదు మనకు ఈనాడు 5 కోట్ల రూ ల లోటుఉన్నది ఇంత deficit తో ప్రభుత్వాన్ని నడపడం కూడా చాలా కష్టం ఈ plan period లో పన్నులు వేసుకోవలసిన అవసరం చాలా ఉన్నది కాని ఆ పన్నులు ఎవరిమైన వేయాలి ? వేరే అవకాశా లేమి ఉన్నాయి అనే విషయం కూడా గమనించాలి మేము కర్నూలులో వుండగా కూడా కొన్ని సలహాలిచ్చాము రాష్ట్రింలో ఎటువంటి పన్నులు వేసుకుంటే ప్రభుత్వానికి ఎక్కువ రాబడి వస్తుంది అనేది నిర్ణయించడానికి ప్రత్యేకమైన ఒక కమిటీని నియమించాలని చెబుతున్నాను రైతుల మీదనే పన్నులు పడుతున్నాయనే ఆందోళన ఎప్పటికప్పుడు జరుగుతూనే ఉన్నది ఈ అవకాశాన్ని తీసుకొని రైతాంగం పట్ల ఏమాత్రమూ విశ్వాసంలేని కమ్యూనిష్టులు కూడా ఈనాడు మొసలికన్నీరు కారుస్తుంటే, రైతులు నిజమేనని నమ్ముతున్నారు ఈదేశంలో ఈ రైతులు, ఈ పరిస్థితులూ ఉన్నన్నాళ్ళు కమ్యూనిష్టులు పరిపాలనచేయలేరని వారికి తెలుసు

అందువల్ల వీరు ఒకప్రక్కన రైతులపట్ల సానుభూతి చూపిస్తూ, రెండవ ప్రక్క ధరలు బ్రహ్మాండంగా పెరిగిపోతున్నాయనీ, రైతులంతా పూర్తిగా ధనవంతులైపోతున్నారనీ ప్రచారం చేసి కూడా ఈనాడు "వారు పన్నులు యిచ్చుకోలేరు, వారిబ్రతుకు ఏమౌతుంది, కడు దుర్భరమైనస్థితిలో పడుతున్నా"రని చెబుతున్నారు అటువంటి నినాదాలు లేకుండా— ప్రభుత్వం సరియైన దృష్టితో ఆలోచించాలని కోరుతున్నాను రైతుల యొక్క వ్యాపార పంటల విషయంలో ప్రభుత్వంవారు విధించే పన్నులు చెల్లించడం అంత కష్టమైన విషయంకాదు, కాని పండిన పంటకు సరైన గిట్టుబాటు ధర వచ్చేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వం తీసుకోవాలి. ఆవిధంగా చేస్తే డిశంబరులో వచ్చిన ధర ఏప్రిల్ నెలనాటికీ వచ్చేందుకు ప్రభుత్వం కట్టుదిట్టమైన ఏర్పాటులు చేస్తే, ఈనాడు వేస్తున్న 50 లక్షల రూ.లు మాత్రమే కాదు. 2 కోట్ల రూ ల వరకూ పెంచినా ఏ రైతూకూడా ఇబ్బందిపడడు. అందువల్ల ప్రత్యేకంగా ఈవ్యాపార పంటల పరిస్థితి, వాటి ధరల పరిస్థితి, ధరలు ఎందువల్ల పడిపోతున్నాయి ? సహజంగా కాలమాన పరిస్థితిని పోతున్నాయా ? అనేది గమనించాలి కాలమాన పరిస్థితి కారణమైతే ఏ ప్రభుత్వముకూడా కాపాడలేదు. కాని వీటిని ఏ కొద్దిమంది వ్యాపారస్థులో control చేసి తాము లక్షలాది ధనం గడించుకోవా

లనే ఉద్దేశంతో "మేము యింతకంటే ఎక్కువ రేటు యివ్వము" అని చెబుతుంటే రైతులు ఆ సరకును ఇంటిలో వుంచుకోడానికి గాని, ఇతరత్రా దాచుకోడానికి గాని అవకాశంలేక, వారికిఉన్న ఆర్థిక పరిస్థితులనుబట్టి ఆ నష్టానికే వెంటనే అమ్ముకోవలసిన పరిస్థితి ఏర్పడుతోంది ఈ విధంగా వ్యాపార పంటలు రైతుల చేతినుంచి వ్యాపారుల చేతిలోనికి పోయిన మరు క్షణంలోనే ధరలు బ్రహ్మాండంగా పెరిగిపోతున్నాయి ఈ విషయాలన్నీ ప్రతిపక్ష సభ్యులుకూడా ఆలోచించాలని కోరుతున్నాను ధరలు పెరగడానికి కారణమేమిటి ? దీని కీలకం ఎక్కడఉన్నదనే విషయం ప్రభుత్వం గమనించాలి ఈ విషయాలలో రైతులకు తగిన రక్షణలు కలిగించితే ఇటువంటి పన్నులు ఎన్నైనా వేసుకోడానికి అవకాశం వుంటుంది మనం 5 కోట్ల రు ల లోటు తీర్చుకోడానికి యిది ఒక్కటే మార్గంకాదు, ఈనాడు పట్టణాలలో అనేక ఆస్థులున్నాయి స్థలాల ధరలు బ్రహ్మాండంగా పెరిగిపోతున్నాయి 10 వేల రు ల విలువగలిగిన స్థలం ఈనాడు 2 లక్షల రు. లు అయినప్పుడు దాంట్లో కొంతభాగం ప్రభుత్వం ఎందుకు సంపాదించకూడదని అడుగుతున్నాను. **Deficit budget** తోనే మన ప్రభుత్వం నడవాలనే ఉద్దేశం ఎవరికీలేదు, పూర్తి చేసుకోడానికి అనేక అవకాశాలున్నాయి ఈనాడు రైతు భరిస్తున్నాడు, ఆ విధంగా యితర వ్యక్తులమీద కూడా అవకాశం ఉన్నంతవరకూ వేయాలని మనవిచేస్తూ, వచ్చే సంవత్సరంలోగా ఈ పన్నుల విషయం పూర్తిగా సమీక్షించి, దేశంలో ఎవరెవరిపైన ఎటువంటి పన్నులు వేయడం ఎవరిమీద వేస్తే కష్టం అనే విషయాలను గమనించడానికి వెంటనే ఒక కమిటీని నియమించి, ఆ కమిటీద్వారా పరిశీలన చేయించినట్లయితే, మన ఆర్థిక పరిస్థితిని బాగుచేసుకోగలుగుతాము ముఖ్య మంత్రిగారు, ఆర్థిక మంత్రిగారు, రెవిన్యూ మంత్రిగారు - ఈ ముగ్గురూ కూడా రైతుల కష్టసుఖాలు బాగా తెలిసినవారు వ్యాపార పంటల విషయంలో రైతులకు జరుగుతున్న నష్టాల సంగతి కూడా వారికి బాగా తెలుసును ఈ నష్టాలను అరికట్టడం ఎట్లాగ అనేది బాగా ఆలోచించాలి. ఎంతోమంది నిపుణులు కలిసి దీనిని ఏ విధంగా అరికట్టాలి అని ఆలోచించాలి ఆ తరువాత యిటువంటి పన్నులన్నీ వేసుకోవచ్చు. ఈనాడు 'గన్నీస్' కు సరైన గిట్టుబాటు ధర వుంటే ఒక రూపాయే కాదు, 5 రూ.లు కూడా యిచ్చుకోడానికి సిద్ధంగా వున్నారని మనవిచేస్తున్నాను. ప్రభుత్వం ఈ ధరలవిషయంలో ఏవిధంగా **control** చేయాలి, ఏవిధంగా అందుబాటులో వుండేట్లు చేయాలనేది యోచించాలి. ఈ పన్నుల విషయమై ప్రతి అసెంబ్లీ సమావేశంలో కూడా 'రైతు మీదనే పడుతున్నది' అనే విమర్శకు తావులేకుండా, ఎటువంటి పన్నులు ఎవరిమీద వేయాలో నిర్ణయించాలి, పన్నులు వేయకతప్పదు. 5, 6 కోట్ల రూ.లు ఒకటి, రెండు సంవత్సరా

లలో సంపాదించక తప్పదు ఈ 6 కోట్లు ఏవిధంగా సంపాదించాలనే విషయం పరిశీలించేందుకు వెంటనే ఒక కమిటీని వేయాలి ఆ కమిటీ సూచనల ప్రకారం తప్పకుండా పన్నులు వేయాలి ఈ విషయంలో సరైనవిధానం అవలంబించాలని మనవిచేస్తూ నేను దీనిని బలపరుస్తున్నాను

శ్రీ ఈగూరి చిన్నప్ప (మహబూబ్‌నగర్) అధ్యక్షా, ఈనాడు ఈ పన్నుల విధానం గురించి మాట్లాడిన కొందరు గౌ సభ్యులు "పన్నులు వేయకండి, ఆంధ్రలో మద్యపాన నిషేధం fail అవుతున్నది కాబట్టి, దానిని తీసివేసి. త్రాగుడుకు యింకా అవకాశం యివ్వండి" అని చెబుతున్నారు నా అభిప్రాయంలో 7 కోట్ల రూ ల వరకూ వచ్చే అబ్కారీ లోటును తీర్చడానికి యింకా పన్నులు వేయాలి మద్యనిషేధాన్ని తప్పకుండా అమలులో వుంచాలనే సూచనతో ఏకీభవించేవారిలో నేనొకడను అభివృద్ధికాముకులైన గౌ సభ్యులు ఈవేళ ఈవిధంగా చెబుతుంటే నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది ఈనాడు సాంఘిక సమానత్వం కావాలనుకుంటూ, వెనుకబడిన జాతులను పైకి తీసుకురావాలనుకుంటూ— సాంఘికంగా మనుష్యులలో అభివృద్ధి రానంత వరకూ ఆర్థికంగా అభివృద్ధిచెందలేరని సవినయంగా మనవిచేస్తున్నాను కాంగ్రెసు ప్రభుత్వాలు లేనప్పుడు రైతు శ్రేయోభివృద్ధికి ప్రచారం జరిపించే ఒక సంస్థ తెలంగాణాలో వుండేది కాని, ఈనాడు ప్రభుత్వం కాంగ్రెసు వశమైనప్పటికీ వారు చేసిన వాగ్దానాలను చెల్లించకుండానే జరుపుతున్నారు. విశాలాంధ్ర ఏర్పడితే ఆంధ్రలో వుండే మంచి తెలంగాణాకు వస్తుంది, తెలంగాణాలోవుండే మంచి ఆంధ్రలో అమలులోనికి వస్తుందని మేము ఆశించాము. కాని ఈనాడు విశాలాంధ్రవచ్చేసరికి, ఏఆశలతో విశాలాంధ్రరావాలని పోరాడామో ఆఆశలన్నీ కూడా రానురాను దూరం అయిపోతున్నాయి ఆవిధంగా మనం యిప్పుడు అమలుచేయుట లేదని సవినయంగా మనవిచేస్తున్నాను అధికారంలో వుండే కాంగ్రెసు ప్రభుత్వం పూర్వం చేసిన వాగ్దానాలను చెల్లించినప్పుడే రైతులలో, ప్రజలలో సాంఘికాభివృద్ధివస్తుందని మనవిచేస్తున్నాను.

ఏదైనా ఒక సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని వ్యాపారపంటల (commercial crops) పైన, ఎట్లాగైతే పన్నులు వేయాలనే ఒక సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నారో, అదేవిధంగా వివిధరకాల భూములపైన కూడా తెలంగాణాలోను, ముఖ్యంగా ఆంధ్రప్రాంతంలోను పన్నులువేయాలి. రేగడి ఉంది, తువ్వ వుంది, ఎర్ర గడ్డలుసైన్లు, పాలచౌడులుసైన్లు, కట్టుచౌడులుసైన్లు, రకరకాలైనటువంటి భూములుసైన్లు, తెలంగాణాలో బందోబస్తు ఏర్పాటుచేసి ఆ బందోబస్తు యొక్క ఆధారంపైన ఆ భూములపైన రేట్లను ఖాయంచేశారు. కాని ఆ

విధంగా చేయడంలో తువ్వ అనేటటువంటి భూమిలో వేరుసెనగపంటలకు వేరు పురుగు పట్టి పంటనంతా చెడగొడుతుంది వేరుసెనగపంట, నల్లంటు భూములలో ఎర్రగడ్డలలో బాగా ఫలిస్తుంది నల్లంటు ఎర్రగడ్డలలో దంటుకు 100 కాయలు కాస్తే, తువ్వలో దానికి ఏ పదో, పన్నెండో కాస్తుంటాయి అందుచేత నేను సూచించేదేమిటంటే, ముఖ్యంగా ఈ వేర్వేరురకాల భూములను ఆధారంగా తీసుకొని వాటిపై పన్ను వేసినట్లైతే స్థిరంగా ఆ రేట్లు ఉండగలుగుతాయి ఆముదం మొదలైన వ్యాపారపంటలను మొదటిసారి వేసి, అదేచేనులో జొన్నను వేస్తారు ఆ జొన్నను తీసేసినతరువాత వేరుసెనగ వేస్తారు సాధారణంగా వ్యాపారపంటలను అదేవిధంగా ఒకదానితరువాత ఇంకొకటి మార్చి వేయడం జరుగుతుంది కొన్నిచోట్ల ఆహారపంటలు కూడా వేస్తారు కాని రైతుకు లాభం చేకూరాలంటే ఈ విధంగా వాణిజ్యపంటలనే వరుసగా మార్చి వేయాలి అందుచేత ఆవిధంగానే వేస్తారు ఇదేవిధంగా ఆముదాలు వేస్తూ ఆ సాళ్ళమధ్యలో కందిని ఒక్కొక్కసాలులో వేస్తారు ఆ పంటలపైన ఇతర, commercial crops పైన రైతుకు ఎక్కువఆదాయం వస్తుందని అనుకోవడం సహజమే ఐనప్పటికీ seasonal rates ఏవిధంగా ఉంటాయంటే, season సమయంలో ప్రభుత్వం export permits ఇవ్వకపోవడంవలన రైతుకు వాటికి తక్కువ ధర వస్తుందని నేను మనవి చేయుచున్నాను అయితే, ఈ సంవత్సరం మాత్రం season లో export permits కొంతవరకు యివ్వడంవల్ల ఈ season లో గత 4,5 సంవత్సరంల లెక్కలను బట్టిచూస్తే ఈ commercial cropsకు ముఖ్యంగా వేరుసెనగపంటకు (ఏ పంటైతే అధికంగా పండుతున్నదో ఆ పంటకు) ఈ నాలుగు సంవత్సరములలో కంటే ఈ సీజన్‌లో ఉన్నధర ఏ సంవత్సరపు season లోనూ లేదని నేను తెలియచేయుచున్నాను చిన్నకారు రైతుకు లాభంకలగాలంటే season లో ఎక్కువధర ఉండాలి ఆ విధంగా ఉన్నపుడే అతనికి అధిక లాభం కల్గుతుంది అందుకు ప్రభుత్వం season లో export permits యివ్వాలి Season లో ధర లేకుండా చిన్నకారు రైతుకు లాభం కలుగకుండా stock చేసుకొన్నటువంటి, పెద్దరైతులకు, వ్యాపారస్థులకు మాత్రమే లాభం వుంటుందని నేను మనవి చేయుచున్నాను ఈ విధంగా చేసి చిన్నరైతులమీద పన్నులు వేయండి ఫలవాలేదు. ఈ విధంగా రైతులకు పన్నులు, ఇదివరలో 60 రూపాయలు పుట్టిధర ఉన్నపుడు, ఉన్నటువంటి పన్నుపైన, ఈనాడు పుట్టిధర 6 వందల రూపాయలు ఉన్నపుడు రైతులమీద ఒక రూపాయి, 2 రూపాయల పన్ను వేస్తే దానివల్ల రైతుకు నష్టంవస్తుందని ఎప్పుడూ నేను చెప్పలేదు కాబట్టి రైతులమీద పన్నులు వేస్తున్నపుడు వాళ్ళకు తగిన సౌకర్యములు కల్గించాలి. వారికి బాగుగా అన్ని సౌకర్యములు కల్పించి ఒకేతార స్థాయిని

రైతుకు కల్గిస్తామని హామీ యివ్వాలి ఈ సీజన్‌లో ధరలు ఎక్కువగా లేకుండా ఉంటే పెద్దరైతుకు stockist కు, వ్యాపారస్థులకు మాత్రమే ఎక్కువలాభం కల్గుతుంది కాబట్టి, ఆషాఢ, శ్రావణ మాసములలో బాగా ధరలు పెరిగి పెద్ద రైతుకు, stockist కి వ్యాపారస్థులకే ఎక్కువలాభ వస్తుంది కాబట్టి అలా కాకుండా seasons లోనే export permits ను యిచ్చి ఈ విధంగా export జరగినట్లయితే ఈ పద్ధతి ముఖ్యంగా చిన్నకారు రైతుకు లాభకారిగా ఉంటుందని మనవి చేస్తున్నాను, ఇదేవిధంగా ఎరువులను బాగుగా supply చేయాలి ఆ ఎరువుల supply విషయంలో ముఖ్యంగా అమోనియా సల్ఫేట్ super phosphate మొదలైనటువంటి వాటిని రైతులకు సమృద్ధిగా supply చేయాలని, వాటిని concession rates కు యివ్వాలని మనవిచేస్తున్నాను ఇవన్నీ కలుగచేసినపుడే ప్రభుత్వం రైతులకు ప్రయోజనకరమైనటువంటి పనులు చేసినట్లవుతుంది వ్యాపార పంటలలో ముఖ్యమైనవి పొగాకు వేరుసెనగ వెరుసెనగ ఆహారపంటలక్రిందకు వస్తుందేమో అనుకుంటాను మిరపకాయలుకూడా ఆహార పంటక్రిందకు వస్తాయి పొగాకుపంట, ఆంధ్రలో కొన్ని ప్రాంతాలలోను, గుంటూరు జిల్లాలోను పండుతుంది. కాని సామాన్యంగా ఇక్కడ తెలంగాణా ప్రాంతంలోనున్న కుష్కీ భూములలో, మెట్ట పొలాల్లో యీ పొగాకు పంట, లేదు కొన్ని ప్రత్యేక ప్రాంతాల్లో పొగాకు పంట పండుతుంది సాధారణంగా అన్నిచోట్ల ఎక్కువగా వేరుసెనగ, ఉలవ పంటలు వేస్తారు కట్టె చౌడున్న భూములలో సామాన్యంగా వేరుశెనగ బాగా పండదు, ఎక్కువ తువ్వ ఉంటేకూడా పంట బాగా పండదు కాబట్టి ఈ పన్నులను ముఖ్యంగా ఈ భూముల వివిధ రకాలనుబట్టి, వాటిని ఆధారంగా చేసుకొని విధిస్తే బాగుంటుందని నేను సూచిస్తున్నాను మన శాసన సభ్యులందరమూ కలిసి ఈ శాసనసభలో శాసనాన్ని చేస్తున్నాము. మనం ఏదైనా శాసనాన్ని చేస్తే అది సరిగా అమలులోకిరాదు, కాబట్టి మనం శాసనాలు చేయకూడదనేటటువంటి సిద్ధాంతాలతో నేను ఏకీభవించలేక పోతున్నానని మనవిచేస్తున్నాను. ఇంకా ముఖ్యంగా వెనుకబడిన జాతుల అభివృద్ధికి, పేదప్రజానీకం యొక్క అభివృద్ధికి, వెనుకబడిన కులాలవారి యొక్క అభివృద్ధికి, ఇదివరకు ఎట్లా అయితే ఆంధ్రప్రాంతంలో మద్యపాన నిషేధాన్ని ప్రవేశపెట్టి, అమలులోకి తీసుకొనివచ్చి సామాన్యప్రజకు మేలుకలుగచేస్తున్నదో ఆదేవిధంగా తెలంగాణాలోకూడా సాంఘికాభివృద్ధి, సామాన్య ప్రజలలో ఆర్థికాభివృద్ధి కావాలంటే తద్వారా రాజకీయాభివృద్ధి ప్రజలలో కలగాలంటే అందుకు ప్రభుత్వం ఎన్ని పన్నులువేసినా ఫరవా లేదు. ఆ పన్నుల ద్వారా, వచ్చిన లోటును తీర్చుకుంటూ రెండవవైపు మద్యనిషేధం శాసనాన్ని

వెంటనే అమలులోకి తీసుకురావాలి దానిని అమలులోనికి తీసుకురాకపోతే, ఈ రకంగా మనం ఎన్ని అభివృద్ధి పనులు చేసినప్పటికి ఎన్ని Development Blocks అని, జాతీయాభివృద్ధి కేంద్రాలని, జాతీయ వికాస కేంద్రాలని ఏర్పాటు చేసినప్పటికీ ప్రజలలో ఏమి వికాసం కల్గిస్తున్నాము ఈవేళ మనం? ఈ వికాసాన్ని కల్గించడం కొరకయినా ఈ మధ్యపాన నిషేధ చట్టాన్ని అమలులోకి తీసుకురావాలి అలా తీసుకువచ్చినపుడే ప్రజల్లో నైతికంగా వికాసం కలుగుతుంది ఈ వికాసం కల్గించాలంటే మధ్యపానం మొదలయినటువంటి సాంఘిక దురాచారాలను మాపుచేయాలి నైతికంగా మన ప్రజలు అభివృద్ధి కానందువల్లనే మనం మద్యపాన నిషేధానికి ఒక శాసనం చేయవలసిన అవసరంకూడా వస్తున్నది. అందుచేత సామాన్య ప్రజానీకంయొక్క అభివృద్ధికి, సంజీవరెడ్డిగారి ప్రభుత్వం ఈ అయిదు సంవత్సరముల లోపల మద్యపాన నిషేధ చట్టాన్ని అమలులో పెట్టి దానిని విజయవంతంగా చేకూర్చగలదని నేను ఆశిస్తున్నాను

*శ్రీ ఎమ్ బాగారెడ్డి (జహీరాబాద్) అధ్యక్షా! మంత్రిగారు ప్రవేశపెట్టినబిల్లును బలపరుస్తూ కొన్ని suggestions ను యివ్వదలచుకున్నాను వారు ఈ బిల్లును ప్రవేశపెడుతూ ఈ బిల్లుయొక్క ఉద్దేశాలు, కార్యక్రమాలు, ఈ బిల్లును ప్రవేశపెట్టటానికి గల కారణములు తెలుపుతూ ఈ cash crops, cost of production కే అమ్ముడుపోయినా వచ్చేలాభం ఆహారధాన్యాల వల్ల వచ్చే లాభం కన్నాకూడా ఎక్కువగా ఉంటుంది. అందుచేత taxes వేస్తున్నామని అన్నారు అయితే మంత్రిగారు తమకున్న అన్ని సదుపాయాలను బట్టి, వీలును బట్టి figures ను తీసుకొని, వాటి నన్నిటిని పరిశీలించి చూచిన తరువాతనే ఈ presumptions కు వారు వచ్చి వుండవచ్చును. అయితే యీ presumptions ను బట్టి result అన్ని స్థలములలోపల ఒకేవిధంగా ఉండదు ఏ తీరుగా అయితే రెండు × రెండూ నాలుగు అని ఇక్కడా అవుతుంది, ప్రపంచం లోపల ఎచ్చటనయినా రెండు × రెండూ నాలుగే అవుతుంది కాని యీ presumptions అన్ని స్థలములలోపల అదే result వస్తుందనే దానికి అవకాశంలేదు. ఒక irrigation విషయంలో చూచినట్లయితే cost of production అందరికీ ఒకే విధంగా ఉండదు అన్ని పంటలకూ ఒకేవిధంగా ఉండదు. చెఱకు పండించే వ్యవసాయదారులకు cost of production ఎక్కువగా ఉంటుంది అసలు irrigation సౌకర్యాలను చూచినట్లయితే వేర్వేరుగా ఉంటాయి. కొన్నిస్థలాలలోపల నీటిని బావులనుంచి చేతితో తోడుతారు. కొన్ని స్థలాలలో మోటలతో నీళ్ళు తోడుతున్నారు Oil engines తోటి, electricity తోటికూడా నీళ్ళు తోడుతున్నారు. Canals నుంచి చెరువులనుంచి కూడా నీళ్లు పారిస్తున్నారు. వీటికయ్యే ఖర్చు

లన్నీ సమానంగా ఉండవు 4 ఎకరాల భూమిని వేర్వేరుగా మనం తీసుకొని చూచినట్లయితే చెరువులనుంచి, కాలువలనుంచి నీళ్ళు తోడేదానికి ఆ 4 ఎకరాలకు ఎంత ఖర్చుచేస్తున్నారో, అంతకన్న బావులనుంచి, ఎలెక్ట్రిసిటీతోను, oil engine తోటి, మోటారుతోటి నీళ్లుతోడే దానికి ఖర్చు చాలా ఎక్కువ వవుతుందని నేను మనవిచేస్తున్నాను 4 ఎకరాలభూమికి మోటారుతో నీటిని తోడుకొనే దానికి ఆ రైతు ఒక సంవత్సరం పనిచేయవలసివస్తుంది మోట కట్టివలసి వస్తుంది కనీసం అందుకు 4 ఎడ్లు, బొక్కెన, యివన్నీ లెక్కవేసి చూసినట్లయితే రైతుకు సంవత్సరానికి 5 వందల రూపాయలకు తక్కువఖర్చు కాదు మొత్తంమీద వానికి 4, 5 వందల రూపాయలు 4 ఎకరాల భూమికి ఖర్చవుతుంది Oil engines పెట్టి నీళ్ళు తోడినట్లయితే, 6, 7 వందల రూపాయలు ఖర్చవుతుంది Electricity తోటి నీళ్లు తోడితే 3, 4 వందల రూపాయలు ఖర్చవుతుంది కాని ఎక్కడెక్కడయితే tanks, canals నుంచి నీటిని పారించుతారో అచట కనీసం 20, 40 రూపాయలు ఖర్చుపెట్టినాకాని, వాడు చెల్లించే శిస్తు 100 రూపాయలకు మించక పోయినా, 80 రూపాయలకు తక్కువ ఉండదు ఈ తీరుగా ఖర్చులు స్థలాలనుబట్టి ఉన్నాయి. అందువల్ల ఒక చెఱకువంటను పండించేవాళ్ళు, చెరువులక్రింద పండించే వారి, canals క్రింద పండించేవారియొక్క, బావులక్రింద పండించే వారియొక్క ఖర్చులను మనం లెక్కవేసి చూస్తే వేరువేరుగా ఉంటున్నాయి వారు పండించిన పంటలను మార్కెటుకు తీసుకువెళ్ళినపుడు "నేను దానిక్రింద పండించినాను, నాకు ఖర్చులు ఎక్కువయినాయి, నాకు ఖర్చులు ఎక్కువ వచ్చినాయి, నాకు దానిలోపల margin ఏమీ లేదు, అందువల్ల నా బెల్లానికి ధర ఎక్కువ ఉండాలని" అంటే కొనే మార్కెట్ వుండదు Market లో ధరను నిర్ణయించేది చెరువులక్రింద పండించేవారికి, canals క్రింద పండించేవారికి బావులక్రింద పండించే వారికి, ప్రతివారికి ఒకటేధర ఉంటుంది ఆ ధరనుబట్టి చూసినట్లయితే చెరువులక్రింద పండించిన వారికి ఏదైనా margin ఉంటుందేమో. ఆ మార్జిన్ వచ్చినందువల్ల వారికి ఎక్కువగా రాబడులు వస్తున్నాయి. అందుచేత చెరువులక్రింద canals క్రిందపండించి ఎక్కువలాభం పొందే వారిపైన, బావులక్రిందపండించి తక్కువ ఆదాయం వచ్చేవారిపైనా ఒకే tax వేస్తేఅది ఏమంత సమంజసంకాదు. బావులు త్రవ్వుకొనేందుకు వారికి 2 వేలో, 4 వేలో రూపాయలు ఖర్చు పెట్టవలసివస్తుంది ఆ ఖర్చును పెట్టుటే కాకుండా irrigation సదుపాయాలకుకూడా వాళ్ళకు ఎక్కువఖర్చులు అవుతాయి. అందువల్ల ఇటువంటివారిపైన ఈ tax ను తీసివేయాలని నేను మనవిచేయుచున్నాను ఎందుకంటే ఈ Bill వచ్చినతరువాత ఆలోచించి చేయక పోయినరోజుల

రైతులకు అన్యాయంజరుగుతుంది వారిని ఆ tax నుండి మినహాయించి మేలు చేయాలి వారికి అన్యాయం జరుగకుండా చేయవలసివున్నది వ్యవసాయమునకు వీరికి చాలా ఖర్చులు అవుతూఉన్నాయి ఇంకా ఏమైనా సూచనలు చేయమని మంత్రిగారన్నారు కృష్ణా, గుంటూరు జిల్లాలనుంచి వచ్చిన షావుకార్లు చాలా మంది ఇక్కడ money lending business చేయుచున్నారు ఇదివరలో తెలంగాణాలో దీనికి సంబంధించిన Act ఉండేది దానివల్ల ప్రభుత్వానికి తక్కువ ఆదాయం వస్తుంది అది proper work కూడా చేయడంలేదు దానిని సరిచేసినట్లయితే ప్రభుత్వానికి చాలా రాబడివస్తుంది తరువాత గుంటూరు, కృష్ణా జిల్లాలనుంచి వచ్చినవారు, ఇచట నున్న షావుకార్లు తెలంగాణాలో గ్రామ గ్రామాలకు పోయి జొన్నలను ఉద్దులధర కిచ్చి, పుట్టికి 60 నుంచి 70 రూపాయల వరకు సంపాదిస్తున్నారు, ఆవిధంగా వాళ్ళు ఇచట లక్షలకొలది రూ లు సంపాదిస్తున్నారు అటువంటివాళ్ళ మీద taxes వేసి, Money Lenders Act ను practical గా కట్టుదిట్టం చేసి అమలు జరపడానికి ప్రయత్నించాలని నేను మనవి చేయుచున్నాను ఇంకొక విషయం, ఈ బిల్లువల్ల food grains ఎక్కువ పండుతాయని మనవి చేయుచున్నాను ఈ బిల్లువల్ల మనం ఎంత లాభం పొందుతామని అనుకుంటున్నామో, ఆ లాభం మాత్రం పొందజాలం ఎందుకంటే కొందరు ఈ tax కు భయపడి 25 percent కు 20 percent కు వారి ఆదాయాన్ని తక్కువ చేసుకుంటారు Actual గా పటేల్ పట్వారీలు, Village officers 50 percent కు కొంత తక్కువ చేస్తారు అందువల్ల మనం అనుకున్న ఆదాయం వచ్చేదానికి 75 percent కు తక్కువ చేసుకొని దానిపై 25 percent మాత్రమే లాభం వస్తుందని నేను అనుకొంటున్నాను ప్రజలకు ఇది సహాయకారిగా గాని, వాళ్ళకు సుఖం కలుగచేసే టట్లుగా గాని కన్పించదు కాని ఇది అమలులోకి వస్తున్నదని village officers కు చాలా సంతోషంగా ఉన్నది ఈ బిల్లు అమలులోకి వచ్చిన సమయంలో, వారు తప్పుడు లెక్కలు చూపడం వల్ల వారికి ఎక్కువ ఆదాయం వస్తుందని కూడ సంతోషపడుతున్నారు. అందువల్ల village officers యొక్క అటువంటి విధానాన్ని అరికట్టేందుకు ప్రభుత్వం ప్రయత్నం చేయగలదని అనుకుంటున్నాను

శ్రీ ఎస్. కాశిరెడ్డి (పోచిలి) · అధ్యక్షా, మంత్రిగారు ఎపుడు పన్నుల బిల్లును ప్రవేశపెట్టినప్పటికి కూడా పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయడానికి, లోటు బడ్జెట్‌ను భర్తీచేసుకోడానికి మనం అదనపు పన్నులను వేసుకోవాలని, ఇంతేకాకుండా ఇన్‌ఫ్లేషన్ ఎక్కువవుతోంది, కాబట్టి పన్నుల రూపంలో దానిని తగ్గించాలని, ఆ పన్నును ప్రోగ్రెసివ్ పద్ధతులలో వేము

వేస్తున్నామని మనవిచేశారు కాని ఈ బిల్లు వాస్తవిక పరిస్థితులకు సరిగాలేదు, అనుగుణంగా లేదు ఎందువల్లనంటే రెండవ పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయాలనేది అందరికీ వుంది, దానికి మేముకూడ దోహదం యిస్తాము, కాని రెండవ పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయడానికి పన్నులను వేయాలని కూడ మేము అంగీకరిస్తున్నాము — కాని ప్రభుత్వానికి, మాకు వచ్చినటువంటి తేడా ఎప్పుడూకూడా పన్నులు వేసేటటువంటి విధానంలోనే ఇన్‌ఫ్లేషన్‌ను తగ్గించాలి అంటే "రైతులదగ్గర ఎక్కువడబ్బు ఉన్నదని, దానిని వసూలు చేయడానికి పన్నులు వేయాలని మేము ప్రోగ్రెసివ్ పద్ధతిలోనే వాటిని వేస్తామని" చెప్పారు. కాని ప్రోగ్రెసివ్ పద్ధతిలో పన్నులు వేసేటపుడు రైతులు ఏమైనా భరించ గలిగినటువంటిస్థితిలో ఉన్నారా? లేదా? అనేది చూడకుండా పేదలను మినహాయించాలనేది లేకుండా అందరిమీదకూడా పన్నులు వేసేటటువంటి పద్ధతిని ప్రభుత్వం అనుసరిస్తూంది అందువల్లనే మేము వాటిని అంగీకరించ లేకపోతున్నాము ఇపుడున్న పరిస్థితులేమిటి? ప్రభుత్వం గత 2, 3 సంవత్సరాలనుంచీ విపరీతమైనటువంటి పన్నులను వేశారు. వెట్ ఎసెస్‌మెంట్‌ను ఎక్కువచేశారు తరువాత సెస్‌లు ఎక్కువచేశారు ఇంకా అనేకమైన పన్నులు వేశారు స్టాండర్డైజేషన్ ఆఫ్ లాండ్ రెవిన్యూ అని కూడా తీసుకువచ్చి పెట్టారు ఇంతేకాకుండా ఆంధ్రప్రాంతంలో 1954-55 సంవత్సరంలో 4 కోట్ల 75 లక్షల రూపాయలు వస్తైతే 1957-58 సంవత్సరంలో 6 కోట్ల 80 లక్షలు పన్నులద్వారా వస్తుంది అంటే దాదాపు 2 కోట్ల రూపాయలు, అంటే నూటికి 50 వంతులుదాకా పన్నులు అధికమైనాయని మనం గుర్తించాలి ఈ వేసినటువంటి పన్నులన్నీ ప్రోగ్రెసివ్ విధానము ననుసరించే ఉన్నాయా? లేదా, అంటే అదేమీకాదు అందరిమీద, సామాన్యమైనటువంటి చిన్న చిన్న రైతులమీద కూడ, కుటుంబములను గడుపుకోలేనటువంటివాళ్లమీద కూడా ఈ పన్నులను ప్రభుత్వంవారు వేస్తున్నారు అందువల్ల యిప్పటికే ఈ పన్నులభారం చాలా ఎక్కువగా ఉన్నది రైతాంగం భరించలేనటువంటి పరిస్థితిలో వున్నదని నేను మనవి చేయుచున్నాను నిన్న తిమ్మారెడ్డిగారు మాట్లాడుతూ రైతాంగం పడే బాధలన్నిటిని గురించి చాలా ఉద్రేకంతో వెల్లడించారు. ఇంతకుముందు మాట్లాడిన శ్రీ లక్ష్మణదాసుగారు అదేవిధంగా మొసలి కన్నీళ్ళను కార్చారు ధరలలో చాలా తేడాలుఉన్నాయని, ధరలు నిలకడగా వుండడం లేదని, వాటిని స్థిరీకరించాలని, రైతాంగం చాలా కష్టములలో నున్నదని కూడా అనేకమంది మిత్రులు చెప్పారు. అంతేకాకుండా ప్రభుత్వపక్షంలో నున్నటువంటి శాసనసభ్యులు కూడా వారివారి ప్రాంతములలో అక్కడక్కడ చెఱకు, పసుపు మొదలైన పంటలు దెబ్బతిన్నాయని, అందుచేత

ఆ ప్రాంతములను మినహాయించాలని కూడా చెప్పడం జరిగింది అందువల్ల మొత్తంమీద ఇపుడున్నటువంటి వాస్తవిక పరిస్థితులేమిటంటే, రైతాంగానికి దాదాపు నూటికి 50 వంతులు పన్నులు పెరిగాయి ధరలలో నిలకడలేదు మొన్న vet assessment పన్ను తెచ్చారు, ఇప్పుడు సర్ ఛార్జి అని ఒక పన్ను తెచ్చిపెట్టారు కొందరు చెప్పినట్లు ఈ అక్టోబరు, నవంబరు సెషన్‌ను పన్నుల సెషన్‌గా తయారుచేసి, పనిచేస్తున్నారనేది గుర్తించాలి కమ్మర్షియల్ క్రాప్స్ మీద పన్ను విధింపునుగురించి మంత్రిగారు చెపుతూ- వేరుశనగ, ప్రత్తి, మిరప- యివన్నీ వర్షముమీద ఆధారపడి వుంటాయని చెప్పారు వర్షాలమీద ఆధార పడే పంటలకు వాస్తవంగా నిలకడ ఆదాయంరాదు ధరలు అధ్వానంగా ఉంటాయి వాటిమీద ఈ రకంగా పన్నులు వేయుట సరికాదు కొన్ని లెక్కలు చూస్తే సంవత్సరం, సంవత్సరం పంట తగ్గిపోతుందని గుర్తించాల్సి ఉంటుంది వ్యాపార పంటలవలన లాభంలేదని రైతాంగం ప్రతి సంవత్సరం, తక్కువపంట వేస్తున్నారు ఈదిగువలెక్కలవలన పంటతగ్గుతున్నదని తెలుస్తున్నది 1955-56 సంవత్సరంలో ప్రత్తి 1,31,000 ఎకరాలు, 1956-57 లో 1,03,000 ఎకరాలు 25% పంట తగ్గిపోయింది పొగాకు 1955-56 లో 395 వేల ఎకరాలు అయితే, 1956-57 లో 390 వేల ఎకరాలు ఉన్నది. 1% పొగాకు తగ్గిపోయింది మిరపకాయ - 1955-56 లో 438 వేల ఎకరాలుంటే 1956-57 లో 414 వేల ఎకరాలు ఉన్నది వేరుశనగ కొద్దిగా ఎక్కువ అయినది పొగాకు, మిర్చి యింకా అనేక పంటల విషయంలో ప్రతి సంవత్సరం తగ్గిపోతున్నదని గుర్తించాలి అంతేకాదు ధరలుకూడ నిలకడగా లేనందువల్ల రైతాంగం సరైన ఉత్సాహంగాలేదు ప్రత్తి విషయంలో కొద్ది ధరవచ్చినా పొగాకు విషయంలో దాదాపు 5% ధర, పోయిన సంవత్సరం తగ్గింది పసుపు ధర మరీ అధ్వానంగా ఉన్నది నిన్నవచ్చిన పత్రికలలో గుంటూరుజిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణగారు ఒక ప్రకటన చేశారు పసుపు విషయంలో ఎకరానికి రు. 609 ఖర్చు అవుతుందని, ధరలు తగ్గినందు వల్ల ఆదాయం 475 వస్తుందని, అనగా నష్టం ఎకరానికి రు 134 లు వస్తుంది కాబట్టి, మళ్ళీ పన్నువేస్తే రైతాంగం తట్టుకోలేదని చెప్పారు మా ప్రాంతంలో కూడ పైరువేసేటప్పుడు వర్షాలు లేవు. వేసినపైరు మిడతలదండుతో నష్టమై పోయింది. నీరులేక మిరపమొక్కలు చచ్చిపోయినవి. అక్కడవున్న అధ్వాన్న పరిస్థితుల గురించి, యింతకుముందు ఆ ప్రాంతపు యమ్ ఎల్ ఎ. గారు మాట్లాడారు, తరువాత వర్షములు పడినవని మంత్రిగారు చెప్పారు సకాలంలో పడని వర్షాలవల్ల లాభంలేదు. వర్షంమీద ఆధారపడే పంటలు- వేరుశనగ, పసుపు, ప్రత్తి, యిలాంటివి దెబ్బతిన్నవి ఈ పరిస్థితులలో అదనపు పన్నులువేస్తే చాలా

కష్టం పైరు ఎండిపోతే రెమిషన్ యిస్తారని మంత్రిగారు చెప్పవచ్చును కాని కర్ణంగారు వ్రాసే సాగులెక్కలలో 0-12-0 లు పండిందని, లేక కనీసం 0-8-0 దాటింది కనుక రెమిషన్ యివ్వము అని అంటారు క్రియలో రైతాంగానికి రెమిషన్ దొరుకుటలేదు Inflation ఎక్కువైనందున రైతాంగంవద్ద డబ్బు బాగా ఉన్నదని అన్నారు అది వాస్తవమైన విషయం కాదు చిన్న రైతులవద్ద డబ్బులేదు నూరురూపాయల లోపువారిని మినహాయించి అంతకు పైవారిమీద, భూస్వాములమీద పన్ను వేస్తే సంతోషించేవారము ప్రోగ్రెసివ్ పద్ధతిలో ఈపన్ను వేస్తున్నామని మంత్రిగారు అన్నారు కాని ఈ పన్నులవల్ల చిన్న రైతులు క్రుంగిపోతున్నారు, ప్రభుత్వపక్ష సభ్యులకన్న మేము ఎక్కువేమీ చెప్పటంలేదు కానివారుచెప్పి, బలపరుస్తారు మేము భరించలేముఅని గట్టిగా చెప్పతాము ఈ బిల్లుమీద సభ్యుల అభిప్రాయమే కాకుండా, ప్రజాభిప్రాయం తీసుకొనుటకు బయటకు పంపాలని కోరుతున్నాను ప్రజాభిప్రాయమంటే ఏమిటని, ప్రజలచేత ఎన్నుకొనబడిన వారేకదా యిక్కడ ఉన్నదని, మంత్రిగారు అనవచ్చు. ప్రజలు అంగీకరిస్తారనే ధైర్యం ఉన్నప్పుడు, చాలామంది శాసనసభ్యులు యీ పన్నులు సక్రమంగా లేవని చెబుతున్నపుడు, ఒకసారి ప్రజాభిప్రాయం కూడా తెలుసుకోవాలి ఎన్నికలయి 2½ సంవత్సరాలు దాటిపోయినవి ప్రభుత్వమునకు బలముంటే ప్రజలుకూడా అంగీకరిస్తారు! కాబట్టి ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపవలెనని కోరుతున్నాను

* శ్రీ కె. వెంకటరావు : అధ్యక్షా, ఆఖరున మాట్లాడిన శ్రీ కాశిరెడ్డి గారు ప్రజాభిప్రాయం మీద ఎక్కువ దృష్టి చూపించారు "Dictatorship of the Proletariat" అన్న ప్రధాన సిద్ధాంతంమీద ఆధారపడినటువంటి రాజకీయ దృక్పథం కలిగినటువంటి ఆ పెద్ద మనిషి "There is place for dictatorship" అని సిద్ధాంతం చెప్పేశారు, ఇటువంటిది మా నెత్తిమీద ప్రభావం చేయటం ఎందుకు? ముందు ఆ పద్ధతులను వారి కనుగుణ్యంగా ఉన్నచోట్ల బోధచేసి, అక్కడ మారిస్తే, దాంట్లో లాభం ఉంటే, మేము కూడ అనుసరించటానికి వీలుంటుంది Greek City States సంఘటన తర్వాత ప్రజాభిప్రాయసేకరణ అసాధ్యమైనటువంటి విషయమని తెలిసిపోయింది. ఇప్పటికి ఏ రిఫరెండమైనా ఉన్నట్లయితే, అది చిన్న దేశం అయిన స్విట్జర్లాండ్ వగైరా చోట్ల సాధ్యమవుతోంది గాని, రష్యాలో, చైనాలో, ఇండియాలో, అమెరికాలో సాధ్యమయ్యేదికాదు Circulation అంటే ఏమిటి? ఇవాళ జరిగిన దానికంటె ఏమి జరగాలి? గెజిట్‌లో పడింది, పేపర్లో పడింది; దానిని ప్రజలందరు చదువుకొన్నారు. వారికి కావలసిన తీర్మానాలు పాస్ చేశారని

సభ్యులే చెబుతున్నారు కాంగ్రెస్ ప్రెసిడెంటుగా రైతేనేమి, ఎవరైతేనేమి, ఎవరికివారు తమ ఊరిలో యీ బిల్లువల్ల వచ్చే పరిస్థితులు ఏమిటో ప్రెస్‌లో స్టేట్‌మెంట్ ఇచ్చారు మిత్రులు దాసుగారు జూట్ మీద పన్ను వేయకపోయినా, దానిని గురించి మాట్లాడారు ఎవరిపద్ధతిన వారు చెబుతున్నది ప్రజాభిప్రాయం కాదు అది స్థానికమైనటువంటి అభిప్రాయము కావచ్చును మేము ఎరగనటువంటి కష్టాలు అక్కడ ఉండవచ్చు అవి ఇక్కడ చెప్పవలసిన న్యాయము ఉన్నది వాటిప్రకారంగా యీ బిల్లులోని డిటైల్సులో మార్పులు తీసుకురావలసిన అవసరం ఉంటే తీసుకురావటం న్యాయంగాని, "ప్రజాభిప్రాయం, ప్రజాభిప్రాయం"అని ఇన్‌వర్‌టెడ్ కామాస్‌లో ఇరవై మ్మాట్లు ప్రస్తావించినంతమాత్రం చేత, అది ప్రజాభిప్రాయం కాదు 'Publication of the Bill for circulation' చేయటం వల్ల ప్రజాభిప్రాయం ఇప్పుడు ఉన్నదానికంటె ఎక్కువ వ్యక్తీకరించటానికి వీలుండదు. కాశిరెడ్డిగారు మాట్లాడారు అంటే, వారు పొదిలితాలూకా గురించి చెప్పారని నేను అనుకొంటున్నాను వారు చెప్పకపోయినా, పొదిలి తాలూకా విషయం నాకు తెలుసు ఎప్పుడో 60 సంవత్సరాలకు ఒకసారి వాన కురిసి పంట పండాలిగాని, మిగతా రోజులలో ఇట్టి పరిస్థితులే అక్కడ ఉంటాయి అందువల్ల పొదిలితాలూకా మీద పన్ను వేయాలా అక్కర్లేదా, అక్కడ పంట పండిందా లేదా అంటే, దానిని గురించి ఆలోచించటానికి వేరే మిషనరీ గవర్నమెంటుకు ఉన్నది కాబట్టి ఆ విషయాలను టాక్సేషన్ మీద ఒక ప్రిన్సిపుల్ క్రిందకు తీసుకురావలసిన అవసరంలేదు అదే జిల్లాలో ఇవాళ పెద్ద వాన కురిసింది గూడూరు ప్రక్కన పొలాలు కొట్టుకుపోయాయి. అక్కడ నష్టం వచ్చింది. చెరువులు తెగిపోయాయి మనుష్యులు చచ్చిపోయారు పంటలు పోయాయి ఇప్పుడు యీ బిల్లు ప్రకారం వారిమీద పన్ను వేస్తామా ? లేదు. వారిమీద పన్ను వేయటం ఎలాగులేదు, పైగా మన డబ్బు అక్కడకు పట్టుకువెళ్ళి ఖర్చుపెట్టవలసిన అవసరముఉన్నది అందుచేత పండినచోట నుంచి డబ్బు పుచ్చుకోవాలి, పండనిచోటుకు పట్టుకుపోవాలి తుపాన్‌వచ్చి కొట్టుకుపోయినచోట ఎక్కువ సహాయం చేయాలి. కరువువస్తే కడుపునిండా భోజనముపెట్టాలి. మామూలు ధర్మాలతోపాటు ప్రభుత్వం ఇవన్నీ నిర్వర్తించవలసిఉంటుంది కనుక ఇవ్వవలసినవారి దగ్గరనుంచి, పండిన ప్రదేశాలనుంచి కొత్తపన్నులు వేసి, డబ్బు పుచ్చుకోకుండా ఉండటానికి వీలులేదు అనే సిద్ధాంతం యీ ప్రభుత్వం అంగీకరిస్తున్నది కనుక యీ జనరల్ లైన్ ఆఫ్ క్రిటిసిజమ్ న్యాయమైనటువంటి విషయం కాదని సభ్యులందరికి మనవిచేస్తున్నాను. ఈ పన్నులు వేయటములో ఒక డిఫికల్టీ ఉన్నదని నేను మొదటినుంచి చెబుతున్నాను. మనదేశం బీదది కావటంవల్ల progress in taxation తీసుకురావటం కష్టతరమైన విషయం

అవుతోంది ఇవన్నీ మనం తీసుకురావాలి ఇవన్నీ ఆలోచించటంకోసమే నేను ఒక కమిటీని వేయబోతున్నానని సభ్యులకు మనవిచేశాను పన్నులు వెయట ములో అనేకపద్ధతులు ఉన్నవని నేను ఇదివరకే మనవిచేశాను Proportionate taxes ఉన్నవి Regressive taxes ఉన్నవి Progression taxes ఉన్నవి ఇవన్నీ ఆలోచించుకొని మార్చుకోవాలిగాని, వచ్చే ప్రతిబిల్లులోను progression గురించి విమర్శలు మొదలుపెడితే సాధ్యమయ్యే విషయంకాదు కొంతవరకు యీ progression బాధ తప్పేటట్లే ఉంది మనం భూములకు సీలింగులు పెడితే, యీ ఉపన్యాసాలు వచ్చేసంవత్సరం ఇవ్వవలసిన అవసరం ఉండదు ఎందుచేత నంటె, ప్రతివారికి 15, 20 ఎకరాలు ఉంటే, దానిమీద progression పెట్టటా నికి ఎక్కడ అవకాశం ఉంటుంది? అందుచేత యీ progression దేవుడే తీసుకు వచ్చి పెడుతున్నాడు Progression రెండవ పంచవర్ష ప్రణాళికే పెడుతున్నది Progression నెహ్రూగారి చలువ పెడుతున్నది దీనికి ఇన్స్పిరేషన్ ఇతరదేశాల నుంచి గాని, ఇతరపుస్తకాలనుంచి గాని మనం తీసుకోవలసిన ఆవశ్యకత ఏర్పడక పోవచ్చును. ఇవాళ ఉన్న పరిస్థితిలో progression పెడితే ఏమి నడుస్తుంది ?

సత్యనారాయణగారు చాలా శ్రమపడి చెప్పారు ఎకరం ఉన్నవాడిని యీ బిల్లునుంచి మినహాయించమన్నారు పోనీ, నిమ్మవళ్లకు ఒక ఎకరం ఉన్న వారిని వదలిపెడతామని అనుకొంటే, ఆంధ్రదేశంలో మొత్తం అంతా కలిపి 8½వేల ఎకరాలు ఉన్నది సాధారణంగా నిమ్మతోట వేసేవాడు ఒక ఎకరం కంటె హెచ్చువేయడు రెండు ఎకరాల నిమ్మతోటఉన్నవాడు పెద్దధనవంతుడు ఎందుకంటె ఒక ఎకరంమీద రెండువేల రూపాయలు లాభంవస్తుంది కాబట్టి ఒక ఎకరం ఉన్నవారిని మినహాయించమని చెప్పేబదులు, అసలు ఈ పన్ను తీసి వేయండని అంటే మంచిది (Interruption by an hon Member) సభ్యులు చెప్పవలసింది చెప్పారు నా సంజాయిషీ నేను చెబుతున్నాను

*Mr Speaker* So long as it is not unparliamentary and indecent we must give fullest freedom of speech to every hon. Member So, when the hon Minister is speaking nobody should put a question nobody should interrupt and nobody should cause disturbance and nothing should be done

శ్రీ గోపిడి గంగారెడ్డి : తెలుగులో చెప్పండి.

మిస్టర్ స్పీకర్ మిమ్మల్ని మాట్లాడవద్దని చెబుతున్నాను

శ్రీ కె. వెంకటరావు - కాబట్టి, ఒక ఎకరం ఉన్నవారిని మినహాయించ టము సాధ్యమయ్యేదికాదు. ఒకటి రెండు ఎకరాలకు మించి, ఎవరికైనా ఉండ

వచ్చు ఆ విధంగా ఉన్నవారు మన రాష్ట్రంలో ఎంతమంది ఉన్నారు? రాష్ట్రం మొత్తంమీద ఇద్దరు ఉండవచ్చు, ముగ్గురు ఉండవచ్చు అందువల్ల ఒక ఎకరం ఉన్నవారిని మినహాయించటము, యీ బీదదేశంలో చాలా కష్టము అదే విధంగా చెఱకుతోటల విషయం కూడ ఉన్నది ఎవరో ఒకరిద్దరు వ్యక్తులు చెఱకుతోట 4 వందల, 5 వందల ఎకరాలు వేయవచ్చు మిగతావారందరు వేసేది ఏ పది ఎకరాలో ఉంటుంది అందుచేత పది ఎకరాల వారిని మినహాయించాలనడం సరైందికాదు పది ఎకరాలవారిని మినహాయించమని చెప్పే బదులు, అసలు టాక్స్ వేయవద్దని చెప్పటం న్యాయం ఇప్పుడు ఉన్న వ్యవస్థలో బేసిక్ ఎగ్జంప్షన్ పెట్టాలి అన్నది మనం ఆలోచించటం న్యాయమైన విషయం కాదు

మళ్ళీ ప్రొహిబిషన్‌గురించి సభ్యులు చెప్పారు "కోట్లకొలది రైతులు ఉన్నారు, ప్రొహిబిషన్ తీసివేసి, ఆ డబ్బును కోట్లకొలది రైతులకు ఉపయోగించండి" అని చెబుతున్నారు ఈనాడు ఆంధ్ర రాష్ట్రంలో ఉన్న జనాభా మూడుకోట్ల 13 లక్షలు ఇందులో రైతులు ఎన్ని కోట్లు ఉన్నారు? ఈ జనాభాలో వ్యవసాయ కూలీలు లేరా? భూమి లేనివారు లేరా? ఈ విధంగా చూస్తే, రైతులు కానివారు హెచ్చుమంది ఉన్నారు ప్రొహిబిషన్ తీసివేయమంటే హెచ్చుమందిమీద పన్ను వేసి కొందరికి మేలు కలుగజేయమని చెప్పినట్లే ఔతుంది "ప్రొహిబిషన్ తీసివేస్తేవచ్చేడబ్బుతో టెక్నికల్ కాలేజెస్ పెట్టుకోవచ్చు బాగా చదువులు చెప్పించుకోవచ్చు, హైదరాబాదు పట్టణంలో మంచి థియేటర్ కట్టుకోవచ్చు" అని సభ్యులు చెప్పారు అవన్నీ చేసుకోవచ్చు కాని ఎవరి దగ్గరనుంచి డబ్బు తీసుకొనివచ్చి, ఖర్చు పెట్టాలి? "రైతులకు సౌకర్యాలు కలిగించాలి రైతులనుంచి తీసుకొనే డబ్బు రైతులకు ఖర్చుపెట్టాలి" అని అన్నంతవరకు నాకు అభ్యంతరంలేదు కాని, ప్రొహిబిషన్‌రద్దుచేసి, ఆదాయాన్ని పెంచుకొని, ఆ డబ్బుతో కళా వెంకటరావుగారికి పుట్టబోయే కుమారునకు చదువు చెప్పిద్దామంటే ఏమి న్యాయంగా ఉంటుందని అడుగుతున్నాను అందుచేత ఓ యగ్జాజిరేటెడ్ పిక్చర్ ప్రజంట్‌చేసి "ఎవరికొంపో మునిగిపోతోంది, ఎవరికొంపో తీసివేయటానికి కాంగ్రెసు పుట్టింది, రైతులను చంపివేయాటానికే కాంగ్రెసు పుట్టింది, కాంగ్రెసు ప్రభుత్వం వారినెత్తిన బరువు వేస్తోంది, రైతు క్రుంగిపోతున్నాడు, రైతు భూమిమీద ఉండటం మర్చిపోయి ఇంకా భూమిలోపలికి కూడ వెడతాడు. సీతాదేవిలాగ భూగర్భంలోకి ప్రవేశిస్తాడు" అని యీ విధంగా చెప్పటం అసమంజసము, అన్యాయము అని మనవి చేస్తున్నాను. **Tax the drunkard and then take the money** అనటం సరైందికాదు

ప్రొహిబిషన్ రద్దుచేసి, ఆ వచ్చే డబ్బుతో దేశాన్ని నడపాలనే ఫిలాసఫీ నాకు అర్థంకాదు అధమపక్షం యీ పార్టీ అధికారంలో ఉన్నంతవరకు అది జరిగే విషయంకాదని, దానినిగురించి అనేకమార్లు ప్రస్తావించినా, ప్రత్యేకమైన లాభం లేదని, నేను ఖండితంగా మనవి చేస్తున్నాను

ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సు ప్రోగ్రెసివ్ టాక్సు అందులో అనుమానంలేదు ౩ వేల రూ లు తీసివేసి ఆ పైన పన్ను వేయమంటారు ఇంతవరకు ఇండియాలో ఏ స్టేటుకూడా ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్స్ ద్వారా పది లక్షల రూపాయలు వసూలుచేసిందిలేదు ప్లాన్టేషన్స్‌వగైరా పెద్దవి ఉన్నట్లయితే, ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్స్‌వల్లలాభంవస్తుంది కేరళలో వేసుకోవచ్చు అక్కడ ఉన్నవన్నీ ప్లాన్టేషన్సు అని మొన్న శంకర్ ఒక కార్టూన్ వేశాడు భూమి ఎక్కడైనా ఉన్నదా అని టెలిస్కోప్ పెట్టి చూస్తున్నారు లాండ్ రిఫారమ్స్ పెట్టటానికి ఎక్కడుంది భూమి ? దేవుడు ఇవ్వలేదు అక్కడ లాండ్ రిఫారమ్స్ తెచ్చినా, ఎఫెక్ట్ అయ్యే లాండ్ అంతాకలిపి ౫ లక్షలు, ౬ లక్షలు ఎకరాలు ఉంటుంది. అక్కడ ఉన్న వన్నీ కొండలు ప్లాన్టేషన్సుమీద ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సు వేసుకోకతప్పదు మన రాష్ట్రంలో టీ ప్లాన్టేషన్ లేదు కాఫీ ప్లాన్టేషన్ అసలేలేదు అందుకు కావలసిన పెద్దపెద్ద కొండలు దురదృష్టవశాత్తు మనరాష్ట్రంలోలేవు ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సుకు నేను అనుకూలుణ్ణి దానికి అనుకూలంగా మా పార్టీ ఉంది. కాని ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్స్ అమలు పర్చటంలో లాభం లేదని క్లియర్‌గా రుజువు అయినతరువాత, దానిని అమలులో పెట్టాలని చెప్పటంలో అర్థంలేదు. మనకు నీటివసరులు ఎక్కువఅయి, పంట ఎక్కువఅయి, అభ్యుదయం ఎక్కువ అయిన రోజున ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్స్ పెట్టుకొని, యీ టాక్సులను వదలి పెట్టుకోవచ్చును

తరువాత నా మిత్రులు పి. సత్యనారాయణగారు తుపానులనుగురించి చెప్పారు తుపానులు వస్తాయి అంటే, అవి ప్రతి సంవత్సరము రావు ప మూడు సంవత్సరాలకో ఒకసారి వస్తాయికాని ప్రతి సంవత్సరము రావు. ఈ తడవ దైవకృపవల్ల మనకు తుపాను యిప్పటికి తొమ్మిదేళ్ళుగా రాలేదు అందువల్లి ఆయన యీ మధ్యన యిచ్చిన లెక్కలు అన్నీ సరైనవి కావు. 1949 వ సం॥ తరువాత మరల మనకు తుపానురాలేదు వారి గ్రామమునకు రాలేదు, మాగ్రామమునకు రాలేదు. మా ఇద్దరి గ్రామాలు దగ్గర దగ్గరగానే ఉన్నవి. అందువల్ల తుపాను వచ్చినప్పుడు అరునెల్లి కాపు కొబ్బరి తోటలనుంచి పోతేపోయేటటువంటిమాట నిజమే. ఈ నష్టము కోసము తుపాను వస్తుందను

కోవడము ఎందుకు ? కొబ్బరితోటలలో చేయవలసిన కార్యక్రమములు మాని వేయడము ఎందుకు ? అందువల్ల దైవముమీద నమ్మకము ఉన్నవారు తుపాను రావద్దు అని ప్రార్థన చేస్తారు లేకపోతే దేవునిమీద నమ్మకములేనివారు, ఇంకా creedal faith వున్నవారు దానికి యింకొక మార్గము అవలంబించో లేకపోతే ఎవరుకూడ రాకుండ చేసుకునే మార్గము చూడాలికాని, తుపాను వస్తుందని పనులు మానివేయడము న్యాయమైన విషయముకాదు ఇక బి వి సుబ్బా రెడ్డిగారు మాట్లాడుతూ Congress men have no moral courage అనే దాకా వెళ్ళారు మీరే వారికి సమాధానం చెప్పాలికాని నావల్ల కాదు మరలవారికి అంత సరిగాచెప్పవలసిన అవసరములేదు వారికి అలాంటి దయ మామీదవున్నది కనుకనే వారు అవతల benches మీద కూర్చోవలసిన ఆవశ్యకత వారికి ఏర్పడింది లేకపోతే వారు యిక్కడనే కూర్చుని మేము చెప్పే విధానాలను వారుకూడ support చేసేవారు ఇంతాచేసి వారు చెప్పింది ఏమీ లేదు వారు scarcity conditions కు relife measures కోరారు దానికి దీనికి ఏమి సంబంధములేదు అది విధిగా ఆలోచించవలసిన విషయము వాటిని గురించి ప్రభుత్వం చర్య తీసుకుంటున్నది Chief Minister గారు వచ్చారని చెప్పారు వారు వాటినిగురించి చర్య తీసుకుంటారు

తరువాత పేట బాపయ్యగారు పంటలుపోతే ఏమిచేస్తారు అని అన్నారు. దీనికి బిల్లులో నాల్గవ క్లాజు ఉండనే ఉన్నది దీన్ని గురించి నాలుగవ క్లాజులో definite గా ఉన్నది Remission Rules తో లేనటువంటి విషయము, ఇదివరకు ప్రభుత్వం తీసుకునేటటువంటి చర్యలకంటె మించినకొత్త అధికారము మొదటిసారిగా యీ యాక్టులో తీసుకున్నాము దీనికి కారణము ఏమిటంటే Monsoon minded crops అని చెప్పారు కాశిరెడ్డిగారు చెప్పినట్లుగా ఒక్క వానమీదనే ఆధారపడడము కాదు, మామూలు వరిపంట కంటె యివి ఎక్కువగా ఆధారపడి ఉంటాయి గనుక దానికి, అలాంటిపరిస్థితులకు తేడాలు తగ్గినా, పంటలు పండటానికి ఏ సందర్భములోను కూడ ప్రతి దానికి కాకుండ మొత్తము areas అన్నింటికికూడ యీ బరువు తగ్గించటానికి గాని, లేకపోతే ఒక fact, అంటే ఈ ఉదాహరణ చెప్పాలంటే, యీ సం॥ ము Sugarcane మీద పంటవేయకూడదు, pest వచ్చింది. గనుక మొత్తము శిస్తు కొట్టివేసే అధికారము ప్రభుత్వము Clause 4 క్రింద తీసుకోవడము వచ్చింది గనుక, అలాంటి కష్టములు ఏమైనా వచ్చినట్లయితే, అప్పుడు మనము చూచుకోవచ్చు.

ఇక వావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ "Spend on projects with early returns" అని అన్నారు అంటే తక్షణమె ఫలితమువచ్చే ప్రాజెక్టుల మీదనే డబ్బు ఖర్చు చేయాలని అన్నారు అయితే ఇప్పుడు రామపాదసాగర్ సంగతి చూడండి అది అసలు త్వరలో రాదనుకోండి, ఒక వట్టా అంటే ఏ 20 సంవత్సరాలో పడుతుంది దానిమీద 1 9 return వస్తుంది అంతకంటే రాదు అని నేను యిదివరకే చెప్పాను అక్కడవున్న delta అంతా కూడ లెక్కవేసి చూచినాకూడ అంతకంటే ఎక్కువరాదు అది ప్రయోజనము లేదని నా అభిప్రాయము తక్షణము ఆదాయము వచ్చేవాటికి ఖర్చు చేయమని అంటే, యిక scarcity areas గతి ఏమి కావాలి? ఆ ఏరియాలలో అర్ధ రూపాయి డబ్బులు రాకపోయినను, అక్కడి ప్రజలకు మంచినీళ్ళు సప్లయి చేయవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఉన్నది అందువల్ల అన్నిటినీకూడ సమన్వయము చేసి చూచుకోవలెనేగాని, మన యింటిదగ్గర ఎక్కువలాభం వస్తుందని అక్కడ ఎక్కువగ పండించేవారే వీటని కోరడము న్యాయమైన విషయం కాదు వారు per ton cess గురించి చెప్పారు Per ton కాదు, per acre tax nominal అని అంటున్నాను ఇప్పుడు చెరుకునుగురించి నావద్ద లెక్కలు ఉన్నవి ప్రభుత్వముయొక్క లెక్కలప్రకారము 1038 రూపాయలు సగటు ఆదాయము ఒకమిల్లు ఉన్నచోట వస్తున్నది అందులోనుంచి వారు 60, 70 రూ॥లు సెస్సు water tax యిస్తున్నమాట నిజమే కాని వెయ్యి రూ॥ల ఆదాయముమీద ఒక్కొక్క ఎకరానికి మూడు రూపాయలు వేస్తే అది ఎంతో పెద్దపన్నుగా విమర్శించడము న్యాయమైన విషయం కాదు

ఇక రంగారెడ్డిగారుకూడ యిదే అర్థము ఎక్కువగ చెప్పారు వారు కూడ Select Committee లోఉన్నారు వారు చెప్పిన అభిప్రాయాలు అన్నింటితోను నేను ఏకీభవించలేక పోయినప్పటికినీ, యీ మార్పులను గురించి వారేవయినా సలహాలు యిస్తే, అవి ఆలోచించటానికి వీలవుతుంది.

ఇక మన పుత్తుంబాక శ్రీరాములుగారు పసుపుమీద tax తీసివేయమని argument చెబుతూ చాలాశ్రమపడి తర్కశాస్త్రము అంతా తీసుకునివచ్చారు. ఆ చోట్లలో అంటుమామిడి, బంగినపల్లి, యీచెట్లు పెరుగుతవి మామిడిపండ్లు దొరుకుతవి అక్కడ అవితప్ప యింకొకటి పెరగదు గనుక వాటిమీద పన్ను వేయడము మంచిది. మా తెనాలితాలూకామీదకు ఎందుకు రావడము అనే భావాన్ని వ్యక్తపరచారు. ముందర నిమ్మ, నారింజమీద extra tax వేయమని అన్నారు. Mango groves మీదకూడా వేయమన్నారు అవి వీటన్నిటమీదా పసుపుమీద మాత్రము తీసివేయమని అన్నారు.

శ్రీ పి శ్రీరాములు పసుపుకు ధర తగ్గిపోయినప్పుడు tax కూడ తగ్గించమన్నాను

శ్రీ కె వెంకటరావు అదే ధర పడిపోయినప్పుడు ప్రభుత్వము తీసుకో వలసిన చర్యగురించి నేను యీ బిల్లులోని నాల్గవక్లాజు చూడమని అంటు న్నాను

మిస్టర్ స్పీకర్ మంత్రిగారు ఉపన్యాసములో సభ్యులు చెప్పినదానికి సమాధానము చెబుతున్నప్పుడు సభ్యులపేర్లు చెబితే, దానికి వెంటనే వారు లేచి మంత్రిగారికి అడ్డము తగిలి మాట్లాడటము ప్రారంభిస్తే, యిక్కడ కార్య క్రమము పూర్తికాదు అందువల్ల మధ్యమధ్య ఎవ్వరుకూడ లేవకూడదు

శ్రీ కె. వెంకటరావు నేను అందుకనే యిందాక చెప్పాను పసుపుకు ధర పడిపోకుండా చేయాలంటే దానికి ప్రభుత్వమే interested party అవు తుంది ఎందుకంటే, ప్రభుత్వానికి మరింత ఆదాయము వస్తుందికదా ! శ్రీరా ములుగారుకూడ నేను చెప్పేది తప్పకుండా చేయవచ్చు ఆయనకూడ దేశంలో ఉన్న స్త్రీ లందరిలో యికమీద face powder పూసుకోవడము మానివేసి పసుపు పూసుకోమని propaganda చేసి, పసుపు పూసుకునేటట్లు చేస్తే, పసు పుకు మరింత గిరాకి ఏర్పడుతుంది. ధర పెరుగుతుంది ప్రభుత్వానికి గూడా ఆదాయము వచ్చే అవకాశము ఉంటుంది ఆయన ఆ విధముగ కృషిచేస్తే దానివల్ల ఒక పావలాడబ్బులు ప్రభుత్వానికి వస్తే, సంతోషిస్తాము

ఇక మన మాధవరావుగారు హిందీలో మాట్లాడారు వారు మాట్లాడి నది నాకు చాలావరకు తెలిసింది వారు ఎక్కువగ condition of ryotsను గురించి చెప్పారు. అదే వారు చెప్పినదానిలోని main point. నిన్న బోనస్, గురించి ఎక్కువగ చెప్పారు Chief Minister గారు యిచ్చిన statement మీద విమర్శలు చేశారు దానికి దీనికి ఎలాంటి సంబంధము లేదు

काश्तकारों की मुश्किलात पर हर रोज़ ग़ौर कर रहे हैं। उन की सुधार करने के लिये मसायल का रखना अच्छा होगा।

తరువాత సి వి సూర్యనారాయణ రాజుగారు ప్రత్యేకంగా Hedge crops ను గురించి చెప్పారు దాన్ని గురించి ముందుగానే నేను చెప్పాను. ఇక ముందు ఏమి చెప్పనవసరములేదు.

లక్ష్మణదాసుగారు "Capacity to retain the crop till fair price comes" అన్నారు అంటే fair price వచ్చేదాకా రైతువద్ద ఉండాలి అనే విషయము గురించి మాట్లాడారు దానికోసమే Warehousing Corporations పెట్టబోతున్నారు అందులోగూడ కొంతడబ్బు వచ్చింది అనేక చోట్లలో Warehouses కట్టి, రైతులు తమయొక్క పంటను అక్కడ నిలవచేసుకుని, మంచిధర వచ్చినప్పుడు అమ్ముకునే అవకాశము ఏర్పడుతుందని నేను వారికి మనవి చేస్తున్నాను

తరువాత బాగారెడ్డిగారు ఒకటి రెండు fundamental principles raise చేశారు బిల్లులో bailing కు, pumping కు flowing water కు మధ్య difference ఉన్నది గనుక దీనికి tax లో కూడ distinction చూపించాలని వారియొక్క main argument దీనికి నేను చెప్పే సమాధానము ఏమిటంటే ఈ distinction అసలు Tax ను basic గా చేయడములోనే యిదివరకే తీసు కున్నాము నూతిక్రింద సాగుఅయ్యే భూమిమీద ఒకవిధమైన పన్ను ఉన్నది. చెరువుక్రింద సాగుఅయ్యే భూమికి ఇంకొకరకమైన పన్ను ఉన్నది. Flow irrigation ఉన్నచోట యింకొక రకముగ ఉంటుంది. అది అంతా అసలు basic లోనే ఆ తేడా వచ్చింది గనుక ఇది ఊరికనే దానిమీద సర్‌ఛార్జే గనుక, ఆ varition మొదటినుంచి దానిలోనే ఉంటుంది

తరువాత Money Lenders ను గురించి చెప్పారు. అందులో నెల్లూరు నుంచి వస్తున్నారట అని మన గోపాలరెడ్డిగారితో కూడ మనవి చేశాను వారి మీద త్వరలోనే బిల్లు తీసుకునివచ్చే ఏర్పాటు జరుగుతుంది Food grains పంట ఎక్కువ అయితే, Commercial crops పండించే ఏరియా తగ్గుతుందని కూడ అన్నారు అలా జరిగితే నేను చాలా సంతోషిస్తాను, ఎందుకంటే అన్నము నకు పంటచాలడము లేదని ఒకవైపున బాధపడుతూ commercial crops కు ఏరియా ఎక్కువ చేసుకుంటూ పోతే అది జరగదు. ఆ balance వచ్చినతరువాత diversification కావలసిన అవసరము వుంటుంది. Food కొరత దానివల్లనే ఎక్కువ అయితే యీ House లో ఉన్నవారు అందరు కూడ సంతోషించ వలసి ఉంటుంది

తరువాత కాశిరెడ్డిగారు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను support చేస్తామని మాట్లాడారు. పన్ను విధించమని అన్నారు. కాని యీ పన్నులు వేసేపద్ధతిలో మాత్రము మాకు వారికి difference of opinion వున్నదని వారు ముఖ్యంగా చెప్పినారు. దీనికంతటికీ నేను మొదటినుంచీ సమాధానం

చెబుతూనే ఉన్నాను ఇంతకు, ఆ basic tax ను మారిస్తేగాని ఆ tax, ఆ relationship వాటినన్నిటిని గురించి బాగా study చేసి, నిన్న వారు చెప్పిన 164 రకాల తరాలమీద వచ్చిన పన్నులను కొద్దిగా సమీకరణచేసి వేసేపన్నును రైతు యివ్వకలిగేటట్లు పట్వారీ తప్పులెక్కలు వ్రాయకుండా ఉండేటటువంటి విధానమును గురించి ఆలోచిస్తున్నాము Regional Councils రాబోతున్నవి గనుక ముందు సం॥ము నాటికి యీ బిల్సు అన్నీ వచ్చేటప్పటికి అవసరమైతే ఆనాటికి యీ problems అన్నీ solve అయిపోతాయని అనుకుంటున్నాను

ఇక ఆఖరువిషయము ఒకటి చెప్పవలసియున్నది ఈ tax shift అవుతున్నది అంటే యీ పన్ను వేసినవారిమీదనే నిలిచిఉండదు అని అందరికీ తెలుసును

"The forum may try to shift a tax through increasing the selling prices for its projects or through reducing the purchasing prices for resources which it implies The resources only may try to shift a tax through increasing the selling prices of its resources The consumer may try to shift the tax through reducing its buying prices It follows from this digression of shifting that a transaction involving a price is necessary for a tax to be shifted, the conditions under which lift in prices may be changed will be seen on analysis of shifting and incidence of taxation

దీనినిబట్టి వేసినపన్ను అంతా ఒక్కరే యిస్తున్నారని అనుకోవడము పొరపాటు ఇందులో మూడు భాగములు ఉన్నవి (1) పండించే ఆయన (2) ముడి పదార్థాలను కొనుక్కునే ఆయన (3) Industrial products గా చేసేటటువంటి ఆయన ఈ ముగ్గురి resistance power shift అవుతుందిగనుక, ఇది ఒక్కరి మీదనే పడుతుందనే భయంతోటి యీ legislation pass చేయడములో న్యాయమ్ములేదని మనవిచేస్తూ, ఇది select committee కి వెళ్లుతున్నది గనుక, అక్కడ యింకను ఏమైనా మార్పులు అవసరమైతే ఆలోచించి చేసుకోవచ్చును. అందువల్ల యీ బిల్లును ఏకగ్రీవంగా select committee కి పంపటానికి మీరందరు ఆమోదించవలసిందిగా కోరుతున్నాను

*Mr Speaker* The question is

That the Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957 be circulated for the purpose of eliciting public opinion.

The motion was negatived.

*Sri P Narsinga Rao* I demand a division Sir

The House then divided

Ayes 37 Noes 80

The motion was negatived

*Mr Speaker* The question is

'That the Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957 be referred to a Select Committee, consisting of the following members

1 Sri K. Venkata Rao (Minister)
2 Dr B Gopala Reddy (Minister)
3 Sri R Tirupathi Rao
4 ,, K Vijaya Bhaskara Reddy
5 ,, P V Narsimha Rao
6 ,, P Venkata Subbayya
7 Smt Y Seeta Kumari
8 Sri J B Muthyal Rao
9. ,, Ranga Reddy (Ballaonda)
10 ,, P Sundarayya
11 ,, G Yellamanda Reddy.
12 ,, C Rajeshwara Rao
13 ,, P Narsing Rao
14. ,, T Papa Rao
15. ,, P Sreeramulu
16. ,, Kishtamachari.

The motion was adopted.

మిస్టర్ స్పీకర్ · శ్రీ కె. వెంకటరావుగారిని యీ సెలెక్టు కమిటీకి Chairman గా నియమించడమైనది.

రేపు ఉదయం 8-30 గంటలకు తిరిగి సమావేశమవుదాము.

***The House then adjourned till Half past Eight of the Clock on Sunday the 9th November 1957.***